సం॥ర చందా రు 1-0-0(పోస్టేజితోసహా) Reg. No. M. 3766

సంపుటము 32 సంచిక 7

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

# Andhra Rastra Prarambha Vidya

(విద్యావిషయిక మాసపత్రిక)

**అక్టోబరు 1943**

సంపాదకులు:

శ్రీయుత మహావాది వేంకటరత్నముగారు, బి.ఏ.,



వ్యవస్థాపకులు

శ్రీయుత ఈదర వెంకయ్యగారు,

ప్రొప్రయిటరు:

రామా అండ్ కో.,

హెడ్ఆఫీసు :— ఏలూరు,

బ్రాంచెస్:— గుంటూరు - రాజమండ్రి.

Printed by Mr Edara Venkaiah at his Pattabhirama Press, Ellore.

# విషయసూచిక

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభ విద్య

ANDHRA RASTRA PRARAMBHA VIDYA

విద్యావిషయిక మాసపత్రిక

| సంపుటము 32 | ఏలూరు 15 అక్టోబరు | సంచిక 7 |
| --- | --- | --- |




## నిత్యసంకీర్తనము

**వివరణము :**

మనము నిర్వహించవలసిన దంతయు మన కొఱకేగాని పరులకై కాదు. మనము దివ్యసంబంధము కలవారమని నిర్ధారణచేసికొనవలయును. మనకొక దివ్యమగు కార్యభార మున్నదనియు, మన మాయనకొఱకే జీవించుచున్నా మనియు, ఆయన ప్రేమసందేశమునే వ్యాపకమొనర్చుచున్నామనియు, ఋజువుచేసికో వలెను. ఊరక బోధనలిపిన మాత్రమున గాదు. ప్రతివాడు బోధకుడైన నుపయోగమేమి? అతి పవిత్రముగ జీవితమును గడుపవలెను.

**సంకీర్తనము:**

1. కర్మనియంతయగు పరమాత్మ నా జీవిత మాదర్శప్రాయముగ నుండు నట్లనుగ్రహించును గాక !
2. నా చిత్తమునుండి సంకుచిత భావములు తొలగిపోవునుగాక !
3. సర్వమున కా భగవంతుడే ఆధారమని విశ్వసించునుగాక !

—స్వామి రామతీర్థ

# జోహారు

చిలకా వేంకటకృష్ణదాసు

సీ. శ్రీరమణీమణీ చిత్తాబ్జభృంగాయ, దివ్యప్రతాపాయ తే నమోస్తు
విశ్వసంభరణాయ ! వేదాంతవేద్యాయ, ధీరాగ్రగణ్యాయ తే నమోస్తు
భక్తాళిమిత్రాయ ! పాపవిదూరాయ ! జ్ఞానస్వరూపాయ తే నమోస్తు
సారవిహీన సంసారాబ్ధిపోతాయ ! దేవాది దేవాయ తే నమోస్తు
గీ. వేణుగాన విలోలాయ తే నమోస్తు | త్రిదశసంస్తుత్య చరితాయ తే నమోస్తు
మౌని హృత్పద్మవాసాయ తే నమోస్తు | దీనసంత్రాణ దీక్షాయ తే నమోస్తు.
గీ. నీవె రాజువు వర్ణింతు నేను కవిని | నీవె భూమివి పండింతు నే కృషీకుడ
- నీవె దేవుడ వర్చింతునేను భక్త | జనుడ, నాకు వైదగ్ధ్యమిమ్మనఘచరిత.
గీ. నీవె దిక్కని మదినెంచి నిశ్చలముగు | భక్తిఁగొల్చెడివారి యాపదలఁబాపి
కొంగు బంగారమైయొప్పు మంగళాంగ | ఆదరంబునఁ గొనుము జోహారుశతము.

---

# ప్రశంసాశీస్సు.

శ్రీమతి డి. యస్. ఆర్. అన్నాప్రగడ

గీ. ప్రాథమికవిద్య నీసదాశ్రయము వలన | నెలనెలకుఁ గ్రొత్తరుమలతో నెగడుచుండె,
చరితగన్నట్టి విద్యాప్రచారవీవు | రమ్యగుణ ! ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య.
గీ. చాలునిదియంచు నితర ప్రసక్తిలేక | బాలభారతీ వ్యాప్తికై పాటువడుచు
పనివడి తెలుంగుబాస కపారమైన | సేవఁజేయుచు మహిత సుశ్రీలఁగూర్చి
వన్నెవాసియుఁగను సరస్వతివి నీవు.
క. నీకీర్తి నిర్మలంబయి | ప్రాకటముగ సర్వదిశల వ్యాప్తంబగుచున్
రేకెత్తి వెల్గుగావుత | నీకిదె యాశీస్సుగొనుము నిర్మలచరితా !

---

# పద్యకథలు

(గతసంచిక తరువాయి)

కె. ఎ. స్వామి

కథనము కథకు ప్రాణమువంటిది. కథలోని న్యాయమును పలుకుచు దానిని నిర్ధారణచేయుటకు సహజమైన వర్ణనలు, మృదువైన పదములు, పొందు పరచికవి తన కవిత్వశక్తిచే కథను సృజించవలెను. కథ చెప్పుధోరణి కథకు హృదయము. అట్టి కథన ముసుగుపడిన తోడులేని రమణివలె కథకళా

విహీనమై, నిర్జీవమై, యుండును. అనంతామాత్యుని కథనము చక్కనిది కథకు అందమునుకూర్చునది బలి రాజ్యము, రామరాజ్యము, ధర్మజుని రాజ్యము లెట్టివో భోజుని రాజ్యముగూడ అట్టిదేనట. వర్ణనలధికముగానుండ భోజునిరాజ్యము మంచిరాజ్యమని సూక్ష్మదృష్టితో పాఠకులు గ్రహించునట్లు చెప్పినాడు కవి. ఆభోజుడు కానలకుపోయి మృగములను వేటాడి అందొకన్యగ్రోధవృక్షమును కాంచును.

"ఇట్టిమఱ్ఱియుండ నీ ద్వీపమునువట
ద్వీపమనకయేమి తెలిసియొక్కొ
తొంటిపెద్దలెల్లఁ దొడఁగి జంబూద్వీప
మనిరి నాఁగనొప్పె నక్కజంబు"

యింతటితో మనకావటవృక్షము యొక్క ఉన్నతి తెలియును. ఆవిశాలమైనవటభూరుహముపై భోజు డొకతాపసిని గాంచెను.

బలితపుశాఖయందు బదపద్మయుగంబు బెనంచి ॥
పార్శ్వశాఖలఁ గరకాండము లోనిపి
కన్నులుమోడ్చి యధోముఖాబ్జుడై ॥ తలకొని
వ్రేలుచున్న యొకతాపసు గాంచె విభూతి
భూషణో ॥ జ్జ్వలు డగునాని భోజనృపసత్వము
డావటభూరుహంబుపైన్."

ఇందుముని బలితపు శాఖలందు పదపద్మయుగంబు పార్శ్వశాఖల కరకాండములు, చొనిపియున్నట్లును అధోముఖాబ్జుడై తలకొని వ్రేలుచున్నట్లును, రచింపబడియున్నది. సర్వమును రోసియున్నతపసిని, వివిధ మధుర ఫలపుష్ప సంకలిత తరునికరసము చితంబైన భూములందును, కోకిలలు తమగానమై పుణ్యమును వినిపించు భూములందును, నిర్ఝరులు ప్రవహించు భూములందును, తపము చేయుచున్నాడనుట సామాన్యవిషయము గాని అనంతామాత్యు డట్టివాని పొంతకుపోలేదు. వనమున వివిధములగు వృక్షములతో పాటు మఱ్ఱివృక్షములును ఉండుట సహజము. అందును మఱ్ఱివిశాలమైనది. దానినాతడు మునిపుంగవునకు తగిన స్థానమని నిర్ణయించినాడు. ఇందు అసహజమగు పరిస్థితులేవియునులేవు. అదియట్లుండగా వృక్షాగ్రమున తలక్రిందుగా తపము గావించుచున్నాడనుట కథకు అమితమగు అందమును కూర్చుచున్నది. వింత వింత, వినయములతో కూడుకొన్న ఆనందము చదుచదువరులకు కలుగజేయుశక్తియందున్నది పులివాత బడిపోనున్నగోవు, పులినుండి అనుమతిగొని యింటికి తిరిగివచ్చినది. దానినెరుగవిదూడ బాల్యచాపల్యమున గంతులిడును. దానినిజూచి గోవు.

"ఇట్లు శైశవక్రీడల నెసగుచున్న
కొడుకుదెస జూచి కన్నీరు గ్రుక్కుకొనుచు
గటకటా యిట్టి నెత్తురుగందు నిచట
వైచి పోవంగవలెనె నే నీచగతికి"

అని పోవును. ఇందలిపదముల కూర్పుకళాదృష్టి గలది "...కటా యిట్టినెత్తురుగందు నిచట వైచి పోవంగవ..." నన్న శిలలుద్రవించవా!

## పద్య కథల పరామర్శ

ఖండఖండాంతర వాసులుకూడ ఈ పథ్యకథలను రచించి తమ బాలబాలికల కెనలేని జ్ఞానమును కుమకూర పాటుబడుచున్నారు కాని పాశ్చాత్య దేశములందువలె మనలో చాలమంది రచయితలు పాఠశాలలో చదువు చిన్నపిల్లల పుణోభివృద్ధికై పాటుపడవేదనుట నిక్కము. ప్రాథమికపాఠశాలలో చదువు పిల్లలకు పకరించు పాత్రములు మనభాషలో కొలదిగానున్నవి. "బాలగీతావళులను రచించిన వేంకట పార్వతీశ్వరకవులును చిట్టికైత, కుమారకందము జానపదములు, చదువులదుత్త, మున్నగునవిరచించి కవి కొండల వేంకటరావుగారును, పాతపాటలను సమకూర్చి వేదమళ్ళ కామేశ్వరరావుగారును కొన్ని పద్యకథలను రచించినాళము కృష్ణారావుగారును, చిన్నపిల్లుచదువు పాఠశాలలకు మితిలేని మేలును జేసినారు. తెలుగుభాషలో నూతనముగా బధ్యకథలు వ్రాయబడుచున్నవి. కాని యీ పద్యకథలు నవ్యసాహిత్యారంభ దశయందే మొలచినవి గురజాడవారి ముత్యాలసరములలోని కన్యక, డామన్ పితియస్, మొదలైనవి యిట్టివి కాని రానురాను యీ పద్యకథలు వృద్ధిపొందుటలేదు. ప్రభుత్వమువారు సెలబసులో బిడ్డలకు విషయపరిజ్ఞానమును గల్పించుటకును, భావవికసనలు గూర్చుటకును, వచనపాఠముల వలెనే భావసంబంధమగు పద్యపాఠములును గూడ వాచకములందుండవలయుననుటచే నేడు వాచకములందు పద్యకథలుకూడ చేర్చబడుచున్నవి. ఇట్లు పద్యకథలను వాచకములందు చేర్చవలయునని గ్రహించినవారగుటచే కొందరు భాషావేత్తలు వారు రచించిన వాచకములందు పద్యకథలను చేర్చియున్నారు. ఎ. వి. నరసింహముగారు వారు రచించిన నవీన ఆంధ్రవాచకములందు "గురుచరిత్ర" మున్నగు పద్యకథలు చాలకాలముక్రిందటనే పొందుపరచియున్నారు.

## ౧. పౌరాణిక పద్యకథలు,

కవికొండల వేంకటరావుగారధికముగా

పౌరాణిక పద్యకథలను రచించియున్నారు. "శ్రీకృష్ణుడు - కుచేలుడు" పెద్ద పద్యకథ దీనినింకను చిన్నదిగా రచించినచో సరసయుక్తమైయుండును.* "కృష్ణుడును కుచేలుడును నైదేండ్లవాటినుండియును చెలికాండ్రయి యొక్క గురునికడ విద్యనేరిచి, కలసి మెలసి యెంతయో యైకమత్యత నొసగువారు" అని కథను ప్రారంభించినారు. రెండవభాగమున కుచేలుని బీదరికమును, పిల్లలపోరును భార్య కుచేలుని కృష్ణునియొద్దకు వెళ్ళమనుటయు ఉన్నది. అష్టసంపదలు కలిగి యున్న కృష్ణునికడ కేమికొనిపోవుదునన "మీపరస్పరము నున్న స్నేహభావంబె? అయిన మన యింటగల యిన్ని యటుకులిస్త మూటగట్టుక చని పెట్టు డూటలూఅ" అని జవాబిచ్చినది. ఇట్లుకొన్నిచోట్ల రచన చక్కని పాకమున పడినది. "భీష్ముని కోరిక"?లో కథావస్తువుకొంత పడినది. "శ్రీకృష్ణ"?లో కృష్ణుడు మన్ను తినుట,బలరాముడది తల్లికి తెలుపుట, యశోదకృష్ణుని నోట విశ్వమును గాంచుట వర్ణింపబడినది. "చెప్పుకు చెప్పుడు నాయన్నా! చెప్పితేనీకల్లోతాయి" అని కృష్ణుడు పలుకుట చక్కగా నున్నది. చిన్నపిల్లచేష్టలిందు బాగుగా గుర్తించబడినవి. "శబరి" అస్పృశ్యతను స్ఫురింపజేయును.

"సరళార్ద్రహృదయమో సాధుకన్య
కులభేదమేమి సద్గుణమునీకుండ"

అనుట అంటరానితనమును గుణగణముల ముందు పనికిరాని దానినిగా స్ఫురింపజేయును రచనలో మాత్రము నిపుణత కాన్పించదు.

నాళముకృష్ణారావుగారి పౌరాణికపద్యకథలలో ముఖ్యమైనది పైడిలేడి (౮) అపవాదము ఇవి పాడుగాటి పద్యకథలు పైడిలేడియందు రాముడుమాయాకురంగమునకై పోవుట హా లక్ష్మణా! యని యరచి మాయలేడి మృతినొందుట, పరోక్షమున తెలుపబడినవి. సీత రాముని రక్షించుటకు లక్ష్మణు నంపును. పైకథ • సులభశైలిని రచింపబడినది. "పైడిలేడని యక్కటా భ్రాంతిజెంది, పట్టుమనినీదుసోదరు బంచియుంటి, సుఖముగా యింట కుడిచి కూర్చుండలేక, చెరచుకొంటిని సర్వంబు చేతులార" అని పూర్వకథను సీతచే పలికించును. "పెనగిమృత్యువు పైకొన్న వేళగాని, కలుగదెన్నడు నట్టి యాక్రందరవము" గాన "ఏల యీలీల లక్ష్మణా బేలవోలె దెసలు చూచుచు నుంటివి" "బాణాసనము దాల్చిపొమ్మివేగ" అని అవ్యక్తముగా పలికినది లక్ష్మణుని రామునకు సహాయముగా పొమ్మని".

"కఱకురాలైన కరగు నా క్రందనంబు
వినబడెనో లేదో యింత నీవీనుగవకు"
"ఎంతపిలిచిన మారాడవించుకైన
తొంటిచందము నీయందు తోపదిపుడు"

అను మాటలతో కథకూడా నడచినది. రామసంరక్షణార్థము సౌమిత్రి బయలువెడలలేదని గోచరించినది.

"భ్రాత గాపాడ నీకింత భీతియున్న
నిలిచియుండుము నీవిట నేనె పోయి
శత్రువులనెల్ల నొకపెట్టు జక్కడంచి
స్వామి గొనివత్తు తలపువ్వ వాడకుండ"

అని పలికినది. రసపోషణకు తోడు శైలి గంగాప్రవాహము వోలె వడివడిగా పరుగెత్తినది. ఆమెకు భర్తయందాత్రుత హెండెనది. లక్ష్మణుని చేష్టలకు విచారించినది. కోపగించుకొని రోషావేశమున లక్ష్మణుని దూషించినది. ఇచ్చట కవితన ఊహాలు తరంగవేగమున ప్రవహించునట్లు చేసినాడు.

"ఇంతకాలము దనుక నాకొంతుచెంత, మేకవన్నియ పులివై మెలగినావు. తెల్లమయ్యెను నీతత్వమెల్ల నేడు" అని యింకను కఠినుడుల లక్ష్మణుని నొప్పించినది.

"నిన్ను కాపాడుమని యన్న నిలిపె నన్ను
'అన్న గాపాడ బొమ్మని యనిపె దీవు
ముందుజన నూయి వెనుకకుబోవ గోయి"

దారుణములైన "నీవాక్కులకుగుఱియగుటకంటె అన్నకోపాగ్ని కాహుతియైన మేలుఅని లక్ష్మణుడు పోయినాడు. అచట

"తమహితము, తామెరుంగరు, తమహితంబుగోరి యొరులాడుపల్కుల, చీరిగొనరు తాముచెప్పినమాటలే తథ్యమంచు, పెనగెదరు, చాన, లెంతటివెడగులౌర" అని లక్ష్మణునిచే వ్యాఖ్య చేయించినారు. స్త్రీల సహజలక్షణమును తెల్పినారు. "అపవాదముగూడ నిట్టిదియే. ఈ పద్యకథలందు "మేకవన్నియపులి, మంచుముద్దను పుట్టునే మందుచిచ్చు, కరకుచిరంపాన కోయుట, పిడుగులను బోలుబెడిదంపునుడులు మిన్నువిరిగి మీదపడుట, నిప్పుతునుకకు చెదలంటుట, భానునకు దివ్వెచూపించుభాతి, ముందుజననూయి, వెనుకకుబోవగోయి, కట్టిపడుపకయున్నె యీ కర్మఫలము, కొరవిచేబూని తలగోకికొనుట," మొదలైనసామెతలు, దేశీయములు అనేకముగా వాడబడినవి పైడిలేడి, అపవాదములు, ఉన్నతమైన పద్యకథలు వాని రచనలతితమైనది." యశోద బెదరింపు ఇంద్రువేపల్లెలో యశోదచల్లచేయుట, దానిచప్పుడు

విని కృష్ణుడులేచుట, నవ్వుచుతల్లికడకుపోయి మీగడ, పెరుగు పెట్టుమనిగోలచేయుట, యశోద మీగడ పాలు, పెరుగు చల్లచేసిన తరువాత యిత్తునని ప్రేమతో చెప్పుట, యింకను అల్లరిచేయుచున్న కృష్ణుని రుద్రుడైనను, బ్రహ్మయైనను, లక్ష్యము చేయని గుమ్మడుకుండలో నున్నాడని చెప్పి బెదరించుట, అందుకుకృష్ణుడు జడియక నోరుచూపించుట, అందు యశోద విశ్వమునుంగాంచుట, కథాభాగముగా గైకొనబడినది.

"ఎందునున్నాడు సాగరమందు లేడు
కొండయడుగున లేడు, భూగోళమందు
స్తంభమున లేడు, మఱి యజ్ఞశాల లేడు
క్షత్రదైత్యులలో జననివీడు.

అనుటలో అవతారములు స్ఫురించును. ఇందలి ఊహ చిత్రము ఇంపైనది. వీనిరచన ఉజ్జ్వలమైనది.

(సశేషము)

1. చిట్టికేత
2. చిట్టికేత
3. కుమారకంఠము
4. కుమారకంఠము
5. పైడిలేడి } ఒకపాత్రము
6. అపవాదము }
7. ఆంధ్ర సాహిత్యవాచకము (5)

---

# కష్టకాలము

జి. కె. చౌదరి.

జనవరినెల నాలుగో క్వార్టరుకు గ్రాంటు చెక్కువచ్చే సమయము. అందరూ ఎదురు చూస్తున్నారో లేదో గాని నేను మాత్రము పోస్టాఫీసుచుట్టు తిరగనిరోజు లేదు. చివరకు పోస్టుమాస్టరు కూడ విసుక్కున్నారు. "మీకు చెక్కుమీద వున్న శ్రద్ధలో పదోవంతన్నా బడిమీద వుందా" అని. ఔను నాకక్కర్తి వారికేమి తెలుసు? ఇదిగో చెక్కువస్తుంది- అదిగో చెక్కువస్తుంది అంటూ నెలా పదిహేను రోజులనుండి మజ్జిగ, కట్టెలు లగాయితు బియ్యము, బట్టల బాకీల వరకు, నెట్టుకుంటు వస్తున్నా.

నేను ఏరోజూ టపాటైముకు 1 గంట ముందునుండి పోస్టాఫీసు బయటి అరుగు మీద కూర్చొని ఉండడము- "ఏం, పంతులుగారు! ఇట్లావచ్చారు?" అంటే గ్రాంటుచెక్కు రావాలి అనడము, విన్న బాకీదార్లు చెక్కుమాట వాస్తవమేనని నమ్మి అంతగా బాధపెట్టడంమానేరు.

* * *

కడకు చెక్కువచ్చింది. అమాంబాపతు కోతలు (cuts) తాలూకు పోయిన మూడు క్వార్టర్లకు నేను పుచ్చుకున్న అదనపు గ్రాంటు మొత్తము ఇందు మినహాయించు కోగా నెలకు రూ 10-8-0, కరువుభత్యము రూ 2-0-0 చొప్పున మొత్తము రూ 38-0-0 లోపే. ఈ మొత్తముతోనే లోగడ చేసిన అప్పులు తీర్చుకోవాలి; తరువాత వచ్చే గ్రాంటువరకు ఆసరాగానూ ఉంచుకోవాలి. గుండె ఝల్లుమన్నది, ఎట్లాగా కుటుంబాన్ని పోషించేది అని? తెల్లవారి లేస్తే మాపెద్ద పొట్టలు రెండూకాక ఆరు చిన్నిపొట్టలు కూడా నిండాలి. ఇందు ముప్పొద్దులూతినే వాళ్లేకాని పావలా తెచ్చి సాయపడేవాళ్లు ఒకళ్లూ లేరు. ఆమేమో బాలింతరాలు. ప్రసవమైనప్పుడు స్నానంలోపలే చేసిన

జబ్బుకు తెచ్చిన బాకీలుకూడ ఈ చెక్కు కోసమే ఎదురుచూస్తున్నాయి. ఇవన్నీ తలపుకు వచ్చి చెక్కువచ్చింది అన్న సంబరము ఏకోశానా లేకపోవడమేకాక మీాదు మిక్కిలి విచారహేతువయ్యింది. ఈవరకంటే నేనూ కాస్తవయస్సులో వుండేవాణ్ణి. కుటుంబముకూడ ఇంత యీాడికగ్గా వుండేదికాదు. ఆయేటి కాయేడు కుటుంబవృద్ధి గుణకారములో ఉంటూవుంది, నా శక్తియుక్తులు-ఆదాయముకూడ త్రోసివేతలో వుంటున్నాయి. ఈ విశాల ప్రపంచములో "నీవేతప్ప నితఃపరంబెరుగ" అన్నట్టు గ్రాంటుడబ్బులనే ఆధారము చేసుకొని ఉన్నాము.

ఈ ప్రపంచయుద్ధము మూలంగా ప్రతీ వస్తువు ఐదారింతలుగా ఖరీదు పెరిగిపోయి సామాన్యజీతమువిూద ఆధారపడ్డవాళ్ల తిప్పలు చెప్పశక్యముకాకుండా వున్నాయి. ప్రాథమికోపాధ్యాయుని బాధ్యతలు అంటూ బల్లగుద్ది ఉపన్యాసాలిచ్చే దేశాభిమానులు- అధికారులు ఇతర పెద్దలుకూడ లెక్కకు మిక్కిలి విషమ చట్టాలను గావించి రకరకాల కోతలుపెట్టి ఇచ్చే యీా స్వల్పమొత్తముతో కుటుంబ పోషణము గావించుకుంటూ తన బాధ్యతలను ఎట్లానిర్వర్తించుతాడు అన్న ఆలోచనగల సహృదయుడు ఒక్కడూ కానరాడు.

* * *

ప్రసవమై జబ్బుచేసి మంచముమిాద కాన్పేపు- క్రిందకాన్పేపు, పెడుతున్న సమయంలో పూజారి శాస్త్రుల్లుగారు "నా మాటేమిటి చెప్పారు? పిల్లా జెల్లా గల కుటుంబము. ఏటిపొడుగునా చీడే వాళ్లూ- దగ్గవాళ్లూ" అంటూ బిగిసేరు.

రోగికి చేసేవాళ్లమాటటుంచి మాకిన్ని మెతుకు ఉడకేసిపెట్టేగతి కూడా లేదు. చంటిది సరేసరి. తల్లి కాయలామూలాన పుట్టినప్పటినుండి పోతేపాలే. ఎడబిడ్డ తల్లిమిాద బెంగపెట్టుకుంది, జ్వరముకూడా వస్తూంది. బడికి సెలవుపెట్టి పిల్లలను కనిపెట్టుకొని ఉందామా అంటే మరి ఈ నాలుగురాళ్లూ రావు. బడికి కాస్త 'యీామర్లి' వుందామన్నా ఇనస్పెక్టర్ల అరాత్ విజిట్లు. పులి, సింహము చెరొక ప్రక్క పొంచివున్నట్లుగా వుంది నాపని.

* * *

చెక్కుసంగతి బాకీదార్లు తెలుసుకున్నారు. అందు నాకున్న మొత్తము బహుతక్కువ అని తెలుసుకున్నారు. ఎవరికి వారు తమతమ బాకీలు రాబట్టుకో చూస్తున్నారు. నన్ను నుంచోనీయరు - కూర్చోనీయరు. చెక్కు మార్చడానికి అయ్యే ఖర్చులుకూడ పెట్టుబడి పెట్టి మార్పించారు. చెక్కుమొత్తానికి రెండు మూడు బాకీలుమాత్రమే చెల్లినాయి. రాలేదు, అన్నంతసేపు పట్టలేదు. మళ్లీ షూమూలే. ఉప్పు లగాయతు ఎప్పటిదప్పుడు కొనుక్కోవలసిందే. చేతిలో పైసా లేదు. నిరాధారంగా వున్న కుటుంబము కళ్లెదుట కనబడింది. ఆపుకోలేనంత దుఃఖమొచ్చింది.

* * *

ఉదయము తొమ్మిదయింది. పదయింది పంతులుగారింట పొయ్యిరాజలేదు. పాడ కట్టె కాకుండా వూరెల్లా బాకీలు. రాలేదు రాలేదు అంటు గ్రాంటువచ్చినాకైనా

బాకీలు తీర్చారా ? లేదా మొనంటు ఎవరికి వారికే కష్టముగా వుంది. చివరకుచేట అప్పు, కూడా దొరక్కుండా పోయింది. పచ్చిబళ్లు-పైగా చచ్చిబ్రతికింది. ఈకష్టాలకే కామోసు నేను బ్రతికింది అనుకొని కంటనీరొత్తుకుంటే పిల్లలుకూడఏడ్చేవారు.

అంటుకుపోయిన పొట్టలతో ఆకలి - ఆకలి అంటూ తల్లికాళ్ళకు అడ్డము పడి దీనముగా తల్లికేసి చూస్తే - తల్లిఏడవా, పిల్లలుఏడవా. ఎటుచూచినా శిశువుగోలా, పశిగోలాను పదిన్నరయింది బడివిడచి యింటికి వచ్చాను. ఇంటెల్లపాదీఅన్నమో అన్నమో అంటు నాకాళ్ళకు అడ్డము పడ్డారు నాకడుపు తరుక్కుపోయి దిక్కుతోచక ప్రతిమలాగ నిలబడిపోయాను. ఇంతలోకి తన మెళ్లో మంగళసూత్రము నాకు యిస్తూ మెల్లగా చెవులో చెప్పింది.

* * *

ఆవరదాకానే నొక్కడనే అనుకున్నా, ఈ విధముగా కలువుకు గుటైమై బాధ పడుతోవుంది. ఆచౌకడిపోదగ్గర మూగిన జనాన్ని చూచి, నిలువునా నీరైనాను. ఇసుక వేస్తే రాలకుండా వుంది. ఐదారుగురు పోలీసులు కూడా సర్దలేకుండా వున్నారు. ఈ భియ్యము తీసుకపోతేనేగా మరి మొసరు పెట్టేదిఅనిపించింది.అన్నము, అన్నము అంటు ఏడుస్తున్న పిల్లలు మరోతడవకాళ్ళకు చుట్టుకున్నట్టయింది... .. నాకు ముందంటే, నాకు ముందని త్రోపులాటలూ త్రొక్కులాటలూ వీలు తప్పి పోలీసులు లారీలు విసిరారు. నాకు మతి స్థిమితము లేక- కొట్టినాసరేనాకు బియ్యము యిప్పించు పెందరాడే వెళ్లి వండుకోవాలి అంటు లారీలకు తప్పుకోకపోవడాన రెండు మూడు దెబ్బలు తిన్నా. చివరకు స్పృహ తప్పింది కూడ - కాస్త తెలివి రాగానే - బియ్యము - మొసరు అన్న తబ్బిబ్బు మాటలు విని నాకు పిచ్చ యెత్తుతుందేమోనని, ఒకరు బియ్యము కొలిపించి మూట చూపించగానే తెలివివచ్చి దారిని పడ్డాను.

* * *

తెల్లవారిపచ్చిమంచినీళ్ళయినా మింగలేదు. ప్రాణము కడపట్టే స్థితి. కాని పిల్లలు జ్ఞాపకానికి రాగానే ఒకవిధమైన శక్తి వచ్చి నన్ను అనాయాసంగా నడిపిస్తావుంది. ఇవి వండిగదా పిల్లలకు పెట్టాలి అనుకుంటూ దిక్కులు చూడకుండా వస్తున్నా.

నాలుగయింది. బజారు మొగనేవున్న బడియెదుట గుఱ్ఱపుబండి ఆగివుంది. మనస్సు సంతోషముగా లేకపోవడాన - బడి ముందున్న బండిని చూచి అంతగా అదుర్దా చెందలేకపోయాను. యాదాలాపంగా బడిలోకి వెళ్ళాను. "పంతులుగారికి బడి ఇప్పుడు జ్ఞాపకమొచ్చిందా ? సరే గాని, మీ అసిస్టెంటుకు గ్రాంటు ఇయ్యకుండా వాడుకున్నారటగా - దానికేమి గాని ఇందాకటినుండి మీకోరకు గాను వున్నాడు బండివాడు. బాడిగ ఇచ్చే పంపించండి" అన్నారు ఇనస్పెక్టరుగారు వారిమాటలు వినీవినకుండానే. ఐతే మీరు మాపటి భోజనాని కూడా ఉంటారన్న మాట... ..."అనిమొదలునరికి చెట్టువలె పడిపోయాను.......ఒకగంట తరువాత కాస్త తెలివి వచ్చి కన్ను విప్పి చూస్తిని గదా, నాచుట్టూ గుంటలు పడ్డ కళ్ళు, అంటుకుపోయిన పొట్టలతో నకనకలాడుతు నాభార్య, పిల్లలు కనిపించారు.

# పద్యనీతికథావళి - మొదటి కథ.

## విలుకాఁడు-సింహము

బాలకవిశేఖర వాకాటి పెంచలరెడ్డి

తే. గీ. వేటకొఱకును విలుకాఁడు విపినవీథిఁ । బట్టి పోవు నునుండె నిర్భయము మీఱ
శస్త్రసహితంబుగా వాఁడు చనుచుఁ దలఁచెఁ । "జంపుదును నేఁడు మృగముల జాలిలేక."

తే. గీ. ఆతసిం గాంచి మృగము లత్యంతగతిని । వెఱగుపడిపోవ మొదలిడె విపినభూమి
కాన యంతయుఁ గన్పట్టెగగనభంగి । కాని యొకసింగ మేమియుఁ గదలదయ్యె.

తే. గీ. అంత విలుకాఁడు వేగమే హర్షమతిని । బాణమొక్కటి సంధించి భయములేక
ఇదుగో నామాతఁ గన్గొంటె యాక్షణంబ । నీదుశక్తిని నేఁడె గానంగనగును.

తే. గీ. బటువుగా నీకు హరికి నాబాణమంత । విఱ్ఱవీగుట తోడ్తోన వీడిపోయె
పరుగులిడఁజొచ్చెఁ గేసరి భ్రమము పడుచు । అప్పు డొకనక్క మృగరాజు నరసి యనియె.

తే. గీ. స్వల్పకార్యంబులకు నీవు భయముఁజెంద । రాజనామంబు నీకెట్లు రహినిదెచ్చు
గాన నామాటవిని నీవు కలసి బోయఁ । జంపవలయును పాపిని క్షణములోన.

తే. గీ. వానిదూతయె నన్నిట్టు బాధఁబెట్ట । బోయ నే నెట్లు మార్కొని పోరగలను
అనుచుఁ దోఁకను జాడించి యరిగె నద్ది । కాన స్వపరబలంబులఁ గాంచవలయు.

---

## మంచి అలవాటులు

బాలకవి అన్నాప్రగడ వీరరాఘవయ్య

(కిండరు గార్టెన్ పాట - మొదటి తరగతి)

(ఆటవీస్థలములకేగుదమా - వరుస)

బడిపిల్లలము మనమందఱమూ । మంచిపద్ధతుల నేర్చుదమా ।

1. వేకువజామున లేచుదమా । వేగమే ప్రార్థన చేయుదమా
సమయకృత్యములఁ జక్కఁగఁ దీర్చి । సరగునస్నానము చేయుదమా॥ బడి॥
2. చలిదియన్నమును గుడుచుదమా । చక్కని దుస్తుల వేయుదమా
పలకయు పొత్తము చేతనుబట్టి । బడికీ వడిగా పోవుదమా॥ బడి॥
3. పంతులుగారికి దండము పెట్టి । పద్యము ఒప్పం జెప్పుదమా
బడిలో నల్లరి పన్నులంజేయక । పారము లన్నియు నేర్చుదమా॥ బడి॥
4. ఆటలనైనా పాటలనైనా । అబద్ధమాడక ఉండుదమా
మంచివారమని అనిపించుకొని । మాదిరి నడతను జూపుదమా॥ బడి॥

# భూగోళ ప్రశ్నోత్తరములు

5 వ తరగతి

తాతా జగన్నాథరావు & కీ. శే. వేదుల అన్నయ్యశాస్త్రి



(1943 సం॥ రం॥ ఆగష్టు నెల తరువాయి)

Syllabus heading —iii a) 4 C. ఈజిప్టు, నైలునదిలోయ.

62. ఈజిప్టు దేశపు శీతోష్ణస్థితి ఎట్టిది? యిచ్చటి ముఖ్యపంటలెవ్వి?

జ: ఈజిప్టు దేశము మధ్యధరాసముద్రమునకు ఆగ్నేయమున నుండుటచేతను, పశ్చిమగాడ్పులు వీచుమార్గమున లేనిచేతను, యిచ్చటవర్షములు కురియవు. యిది ఎడారిదేశము. నైలునదియొక్క వరదలవల్ల వేసవిలో ప్రత్తి, చెరకు, జొన్నలును, శీతకాలమున గోధుమలు, పండించుచున్నారు.

63. నైలునదియొక్క ప్రవాహమార్గమును వివరింపుము?

జ: ఆఫ్రికాఖండములోని విక్టోరియా, ఆల్బర్టు, ఎడ్వర్డు సరస్సులలో పొర్లి పోయిన నీటివలన నైలునది ఏర్పడి, ఉత్తరముగా ప్రవహించి, రిజాఫ్‌నుండి సమభూముల మీదుగా కార్టూమ్‌వరకును ప్రవహించి, పిమ్మట మెట్లుమెట్లుగా దిగుచుపోయి మధ్యధరాసముద్రములో కలియుచున్నది.

64. ఈజిప్టుయొక్క ముఖ్య ఓడరేవును, రాజధానీనగరమును, పేర్కొని వాటి ప్రాముఖ్యములను వివరింపుము?

జ: ఈజిప్టునకు అలెగ్జాండ్రియా ముఖ్యమైన ఓడరేవు. యిది నైలునదీ ముఖద్వారముననున్నది. యిచ్చటినుండి ప్రత్తి విశేషముగా ఎగుమతి యగును.

ఈజిప్టుయొక్క రాజధాని కెయిరో. యిచ్చట నైలునది పాయలైనది. ఐరోపానుండివచ్చు విమానము లిచ్చట ఆగును. ఇచట పురాతన రాజులయొక్క గోరీలు (పిరమిడ్లు) గలవు.

Syllabus heading —iii a 4 D. కేపుటవును

65. కేపుటవును ఎచ్చటనున్నది? అచటశీతోష్ణస్థితి ఎట్టిది?

జ: ఆఫ్రికాదిగువను గుడ్‌హోప్ అను అగ్రముకలదు. ఇచట కేపుటవును అను నగరముకలదు. ఈనగరము దక్షిణాఫ్రికాకు ప్రధాననగరము. ఇచట శీతకాలమున మాత్రము వర్షించును. సూర్యరశ్మి విశేషముగానుండును. ఇది మధ్యధరా శీతోష్ణస్థితి గల ప్రదేశము. ఈప్రాంతమందు ఫలజాతులు విరివిగా పెంచబడుచున్నవి.

66. కేపుటవునుయొక్క ప్రాముఖ్యమేమి?

జ: ఈనగరతీరమున చొచ్చుకొనియున్న పర్వతములుండుటచే ఇచ్చట గొప్ప హార్బరుకలదు. ఈ పట్నమునుండి కైరోవరకు 6000 మైళ్లు నిడివిగల Cape to

cairo రైలుమార్గము వేయబడుచున్నది. యీపట్నము హిందూ, అట్లాంటిక్ మహా మహాసముద్రములు కలియుచోటునయున్నది. యిచటినుండి అనేక దేశములకు ఓడమార్గములుకలవు. యీ నగరమునుండిగా పీచ్, ఆప్రికాట్, ప్లమ్, ద్రాక్ష, మొదలగు నవియు, ఉన్ని, నిప్పుకోళ్ల యీకలు, ఎగుమతియగును.

(Syllabus heading —III a) 5 ఎడారిభూములు a) సహారాఎడారి-ఒంటె.

67. సహారా ఎడారి ఎచటనున్నది ? యిచ్చట శీతోష్ణస్థితి ఎట్లుండును ?

జ: ఆఫ్రికాఖండములో సహారాఎడారి అట్లాంటిక్ మహాసముద్రమునుండి ఎర్ర సముద్రమువరకు, తూర్పుపడమరలుగా 3000 మైళ్లును, ఉత్తర దక్షిణములుగ 1200 మైళ్లును, వ్యాపించియున్నది. వేసవిలో ఎక్కువ వేడిమిగను, శీతకాలములో విశేషము చలిగను, యుండును. వర్షముండదు.

68. ఓయాసిస్‌లనేమి ? అచట పండుపంట లేవి ?

జ: యీ ఎడారిలోని నీటిపట్టులను ఒయాసిసులందురు. యిచటజనులు ఖర్జూరపు చెట్లు పెంచుదురు. జొన్నలు, వరి, యవలు, గోధుమలు, కాయగూరలు, పండింతురు.

69. ఒంటెను ఏడారి యోడయని ఏలయందురు ?

జ: ఒంటెపాదములు చీలియుండుటచే, దాని పాదములు ఇసుకలో దించుకొని పోవు. మరియు ఆకలిదప్పులు లేకుండగ ఏడారిలో చాలకాలముప్రయాణముచేయ గల్గుటచే ఒంటెను ఎడారి యోడ అందురు.

(సశేషము)

---

# అస్సాంబాలురు

తాతా జగన్నాథరావు



N. B —యీపాట 1941 సం॥రం భూగోళశాస్త్ర సిలబను ననుసరించి రెండవతరగతి కుపయుక్తమగునటుల వ్రాయబడినది.

వరుస —ఉడుపుడపండమ్మలారా - కచ్చాలెగగట్టి మడిదిగిరం డమ్మలారా॥

1. ఆలకించుడయ్యాలారా - అస్సామందలి బాలురచరితమయ్యాలారా॥ ఆల॥
2. పర్వతమయమైన - ప్రదేశమిదియండి
   వర్షములు విరివిగాను - కురియుచునే ఉండును
   పర్వతచరియలపైన - తే తోటలుపెంచుతారు॥ ఆల॥
3. తెల్లదొరలు తోటలపై - యధికారము గల్గియుందు్రి
   తోటలలోపనికై మన - ప్రాంతపుకూలీజనులు
   అస్సామునకునుబోయి - జీవనముచేస్తారు॥ ఆల॥

4. దేశీయజాతులు మన - కూలిప్రజల సమదృష్టితో
చూడక, తమ బాలురతో - కూలివారినాడనీక
భేదభావములతోను - మెలగుచునూ ఉంటారు॥ ఆల॥
5. తేయాకు మొక్కలకు - పాదులుకట్టియు, మరియు
పాదులందు, నీరునిల్వ - కుండ,, వారుచూచెదరు
చీడపట్టకుండుటకై - మందునీళ్లు జల్లెదరు॥ ఆల॥
6. తేయాకులను, వారు - త్రుంచి, ఎండబెట్టి, మంచి
డబ్బాలందునగాని - ప్యాకెట్లలోగాని
యితర దేశములకెగుమతి - విరివిగ జేస్తారువారు॥ ఆల॥

---

# ఉపాధ్యాయుడే విద్యార్థికి మార్గదర్శి

ఆనమళ్ళ రూబేను - లేబరుస్కూలు టీచరు

నా సోదరోపాధ్యాయులు ఈ విషయమును గమనించిన ఉపాధ్యాయుడే తన జీవితమును లేక నడతను భద్రపరచుకొనుట ముఖ్యమని తలంపకమానరు. చాలమంది యుపాధ్యాయులు తమ నడతవలన బాలుర జీవితమును చెడగొట్టుచున్నారనుట శోచనీయము. గురువుల ననుసరించి శిష్యులు ముఖ్యముగా చిన్న పిల్లలు నడచుకొందురనుట సత్యదూరముగాదు.

బాలు—పంతులుగారండీ! రంగడు బీడి త్రాగుచున్నాడండీ!

పంతు—ఏమిరా రంగా! నీవు బీడీలు త్రాగుచున్నావా? నిజంచెప్పు.

రంగ—(భయపడుచు) అవునండీ! త్రాగుచున్నాను.

పంతు—బీడి త్రాగటం ఎట్లానేర్చుకొన్నావురా?

రంగ—ముందున్న పంతులుగార్లు నాచేత బీడీలు తెప్పించుకొనేవారండి. అప్పుడు ఒకటి యెక్కువగా యిప్పించుకొని నేనుగూడ త్రాగేవాణ్ణి. అప్పటినుంచి అలవాటు అయిందండీ!

పంతు—మరి యిప్పుడు నీకు బీడీలు యెక్కడివిరా?

రంగ—మాయింట్లో ఎవరికీ తెలియకుండ గింజలు తీసుకపోయి బీడీలు తెచ్చుకుంటా.

పంతు—త్రాగుడుకు తోడు దొంగతనము కూడ నేర్చుకొన్నావురా?

ఈ చిన్న సంభాషణమును బట్టి యెవరిదితప్పో పాఠకులు గ్రహింపవలెనని నా మనవి. "బీడీలను, సిగరెట్లను, త్రాగబోకము" అను పద్యమును బాలురకు బోధించునపుడు ఉపాధ్యాయుడు బీడీత్రాగువాడైన ఏమని బోధించునో తెలియకున్నది. పెద్దలు యోచింపుడు.

ఉపాధ్యాయ సోదరులలో కొందఱు తమ పైఅధికారులు వచ్చినప్పుడుకాని, మీటింగులప్పుడు గాని, యేదో మిష పెట్టుకొని బయటికి వచ్చి ఆతురతో బీడీ

ముట్టించి మూడునాలుగు గ్రుక్కలు త్రాగి పోవుచుందురు. అధికారులు రానప్పుడు బడులలోనేపిల్లలయెదుట త్రాగుచుందురు. విద్యార్థులేమని తలంతురో యూహింపకుండుటయు, తాము త్రాగుటవలన పిల్లల నడత యెట్లు మారునోతలంపకుండుటయు, కడుశోచనీయము.

ఇట్టిదురభ్యాస మున్నప్పుడు బీడి త్రాగుట మంచిదికాదని విద్యార్థులకు బోధించుటకు ఉపాధ్యాయునికి ధైర్యముండునా? ఉపాధ్యాయులమైన మనము దీని విషయములో మార్గదర్శకులముగా నుండుటకు ప్రయాసపడియైన బీడీ వగైరాలు త్రాగకుండ ఉండుటచాల శ్రేయస్కరము.

మఱికొంద ఉపాధ్యాయులు మద్యపానము చేయుచు బాలుర ఆరోగ్యాభివృద్ధిని భంగపఱచుచున్నా రనుట గూడ మిక్కిలి విచారకరము. సమయమునకు సరిగా యేదో మిషపెట్టుకొని కల్లు గిడ్డంగులకు వెళ్ళి పానముచేసి బయటికి వచ్చి ఒళ్లు తెలియకుండ క్రిందపడి కక్కుచు దొర్లుచు పడిపోయిన ఉపాధ్యాయులను విద్యార్థులే పైకిలేవదీసి పట్టుకొని నడిపించి యింటిలో దిగబెట్టి వచ్చుట యెంతయు శోచనీయము గదా?

కాబట్టి ఉపాధ్యాయులమైన మనము విద్యార్థులకు మార్గదర్శకులముగా నుండవలెనంటె యీలాటి చెడ్డయలవాటులను విడిచి విద్యాభివృద్ధికి పాటుపడుచు వృత్తి గౌరవమును, వ్యక్తిగౌరవమును, పెంపొందించుకొనుట శ్రేయస్కరమని మనవి చేయుచున్నాను. అన్నివిధముల మననడత చక్కబడునేని మన జీవనోపాధికి గాని, గౌరవమునకు గాని, యేలోప ముండదని నా విశ్వాసము.

---

## హాలికుఁడు

బాలకవి : అన్నాప్రగడ వీరరాఘవయ్య

ఉ. జాలినిఁ జెందుడెందమున జాలులు వాఱిన ప్రేమవాహినీ
జాలములందు లేనగవుసైకతసీమల విశ్రమించు వా
చాలతలో నమాయకపు చాలొకనూత్నశోభ నీనఁగా
హాలికజీవనస్థితి మహామహిమంబును జెందె జోకమై.

ఉ. పూనినకార్యమెల్ల పరిపూర్తి వహించెడుదాక నిశ్చల
ధ్యానసమాధి నుండినయుదాత్తగుణంబులపంట సర్వముక్
దానమొనర్ప సిద్ధ మగుత్యాగము రెండునుగూడి రైతురూ
పాన భువిం జనించెను ప్రపంచకధర్మనిదర్శనంబుగన్.

చ. పగలును రేల మేను నసివాడ శ్రమం జెమటూడ్చి పంటపం
డగ నొనరించియుం దను దినంగనుబోక మరొక్కవాని కీ
యగ నెఱదాతగా బ్రతుకు మాయని మాయనియట్లు కష్టజీ
విగ తను జేసి యేమనుభవించు ప్రతిష్ఠ విరించి హాలికున్.

తే. గీ. ఎంతలెంతలో శ్రమలంది యీనఁగాచి । కడకు నక్కలపాల్సేయుకరణి తనదు
పంట సిరి ఋణదాతకై వసముఁజేసి । వంతలం గుందు దురదృష్టవంతుఁ డతఁడు.
సీ. చవిటిపఱ్ఱలను సస్యశ్యామలములుగా బ్రతిసృష్టిఁ గావించు పద్మభవుఁడు
తనపనియొదప్ప తదిత రాలోచనాతతి నెఱుఁగనిమహాతత్త్వవేత్త
కుడుము చేతికి సీయఁ గులికి పండుగయంచు విశ్వసించెడునట్టి వెఱ్ఱివాఁడు
దాస్యవృత్తులలోన దగులక పైపెచ్చు తనయిచ్చ నడచు స్వాతంత్ర్యజీవి
తే. గీ. పూర్వపుం బద్ధతుల విడిపోక సతము । జాతిజాతీయతను జాటు నీతిపరుఁడు
బాగులోగు లెఱింగిన పండితుండు । ధన్యతం జెందినట్టి యుత్తమతపస్వి.
తే. గీ. కాలపరివర్తనంబునఁ గలుగు భావి । జగతి ధర్మాన క్రొంగ్రొత్తచాయ యలరి
ప్రాతపాలకవరులకు స్వస్తిజెప్పి । రైతు రాజును సృజియించు బ్రజలకెల్ల.

## ఆఫ్రికాఖండము - ముఖ్యవిషయములు

(8 వ తరగతి విద్యార్థులకు)

వేదుల నరసింహాము, బూర్జ.

(గత సంచిక తరువాయి)

**ఇతరవిషయములు:**

ఆఫ్రికాఖండమును చీకటిఖండమను టకు కారణములు:- 1. ఈ ఖండమున కుత్తరమున సహారా యెడారి గలదు. దీనిని దాటుట కష్టము. 2. తీరరేఖ చీలి యుండలేదు. అందుచే నావయాత్ర కనుకూలముగ నుండదు. 3. ఈ ఖండ మధ్యభాగమున దట్టమైన అరణ్యములు గలవు. వాటిని దాటుట దుర్లభము. 4. రొంపినేల. క్రూరమృగములు, విషపు టీగలు. దోమలు, ఎక్కువ. అందుచే దీనిని చాలకాలము వరకు ఎవరునూ పరిశోధింపలేదు. ఈ పైకారణములచేత దీనికి అంధకారఖండమని పేరువచ్చెను.

**సహారా యెడారివలన ప్రయోజనములు**

ఇచ్చట సోడా, పొటాసు, అనులవణ ములు దొరుకును. అకేసియా జిగురిచ్చటి నుండియే ఎగుమతి జేయబడుచున్నది. ఖర్జూరము ఎక్కువగ పండును.

ఈజిప్టుదేశము నైలునది భిక్షము లేక వరము ? ఎట్లు ? ఈజిప్టుదేశము సహారా యెడారిలోనిభాగమే. కాని నైలునది, దాని ఉపనదులు (నీలపునైలు, అటబారా) అబి సీనియా పర్వతములనుండి తెచ్చు ఒండుచే ఈజిప్టుదేశము కప్పబడి సిరిసంపదలతో తులతూగుచున్నది.

**ఇంగ్లాండునకు ఆఫ్రికాకు వ్యాపార మార్గములు**

1. లండను. లివరుపూలు, రేవుల నుండి బయలుదేరి అట్లాంటిక్ సముద్రము మీదుగ ఆఫ్రికాలోని కేప్‌టౌను చేరును. అచ్చటనుండి పోర్టు ఎలిజబెత్ మీదుగ తూర్పుతీరపు రేవులు (డర్బన్, మొంబాసా) చేరవచ్చును.

2. లండను, లివరుపూలు, రేవుల నుండి బయలుదేరి అట్లాంటిక్ సముద్రము నుండి జిబ్రాల్టరు జలసంధిగుండ మధ్యధరా సముద్రములో ప్రవేశించి, ఆఫ్రికా యుత్తరతీరపు రేవులతో (అల్జియర్సు, ట్యూనిస్, అలెగ్జాండ్రియా) వ్యాపారము చేయవచ్చును.

అచ్చటినుండి సూయజు కాలువద్వారా ఎఱ్ఱసముద్రము ప్రవేశించి ఆఫ్రికా తూర్పుతీరమునగల రేవుపట్టణములతో వ్యాపారము చేయవచ్చును.

**ఆస్ట్రేలియాఖండము-ముఖ్యపట్టణములు**

1. కాన్ బెర్రా:— ఇది న్యూసౌత్ వేల్సులో నున్నది. ఆస్ట్రేలియాఖండమునకు ముఖ్యపట్టణము.

2. సిడ్నీ:— ఇది న్యూసౌతువేల్సు రాష్ట్రమునకు ముఖ్యపట్టణము, రేవుపట్టణమైయున్నది. రెండుకొండల మధ్యనున్న గొప్పరేవు. విదేశవ్యాపారమున కిదిప్రసిద్ధి. ఇచ్చటనుండి ఉన్ని గడ్డిపట్టిన మాంసము, గోధుమలు, వెన్న, తోళ్లు, బంగారము, ముఖ్యఎగుమతులు.

3. మెల్‌బోరన్:— ఇది విక్టోరియా రాష్ట్రమునకు ముఖ్యపట్టణము. రేవు పట్టణము. ఇచ్చటనుండి ఉన్ని, గోధుమలు, వెన్న, మాంసము, తోళ్లు ముఖ్యమగు ఎగుమతులు.

| దేశములు | పంటలు |
|---|---|
| 1. విక్టోరియా:— | ద్రాక్ష, గోధుమ |
| 2. న్యూసౌతువేల్సు:- | ద్రాక్ష |
| 3. క్వీన్సులాండు:- | అనాస, చెఱకు ఎక్కువ ప్రత్తి, అరటి మామిడి, కొబ్బరి. |
| 4. దక్షిణ ఆస్ట్రేలియా:— | ద్రాక్ష. |
| 5. పడమటిఆస్ట్రేలియా:— | ద్రాక్ష, ఆలివ్సు, (నైఋతిభాగము) నారింజ. నిమ్మ తోటలు. |
| 6. ఉత్తర ఆస్ట్రేలియా:— | చెఱకు, అరటి, అనాస, మామిడి, కొబ్బరి, దానిమ్మ. |

| ఖనిజములు | దేశములు | పట్టణములు |
|---|---|---|
| బంగారము | విక్టోరియా | 1 బల్లారెట్ 2 బెంటిగో |
| ,, | పడమటి ఆస్ట్రేలియా | 3 కాల్‌గూర్లి 4 కూల్‌గార్లి |
| నేలబొగ్గు, ఇనుము | న్యూసౌతు వేల్సు | న్యూకేసిల్ |
| వెండి, సీసము | న్యూసౌతు వేల్సు | బ్రోకెన్‌హిల్సు సిల్వర్‌టన్ |
| రాగి | 1 క్వీన్సులాండు 2 టాస్మేనియా | |
| తుత్తినాగము | విక్టోరియా | |
| మాంగనీస్ | క్వీన్సులాండు | |

**ఇతరవిషయములు:**

గ్రేటుబారియర్ రీఫ్:— ఆ స్ట్రే లి యా ఖండమునకు ఈశాన్యభాగమున కొలది దూరములో పగడపుపురుగులచేత ఏర్పడిన గుట్టగలదు. దానినే గ్రేటు బారియర్ రీఫ్ అందురు.

2. స్క్వాటర్లు:—ఆస్ట్రేలియా ఖండములోని గొఱ్ఱెల కాపర్లకు "స్క్వాటర్లు" అనిపేరు.

3. "ట్రాన్సుకాంటినెంటల్" రైలుమార్గము:— ఆస్ట్రేలియాఖండపు పడమటి తీరమున పెర్తునుండి దక్షిణ తీరమున స్పెన్సరు అఖాతముమీద నున్న అడిలైడ్ వరకు పోవు రైలుమార్గము.

4. ఆస్ట్రేలియాలో విశేషముగా గొఱ్ఱెల మంద లెచ్చట గలవు? ఎందుచేత?

ఆస్ట్రేలియా దక్షిణభాగమున వర్షము తక్కువ. గడ్డిబీడులు గలవు. ఇచ్చట గాలి పొడిగా నుండును. సాల్టుబుష్ అను ఉప్పు గడ్డిదుబ్బులు గొర్రెలకు చాల శ్రేష్ఠమైనవి.

5. ఆస్ట్రేలియానుండి మన దేశమునకు దిగుమతులు:—గోధుమలు, ఉన్ని, మురబ్బాలు, రైలుపట్టాలక్రింద వేయుకమ్ములు.

### హిందూదేశమునకు ఆస్ట్రేలియాకు వ్యాపారమార్గము.

చెన్నపట్టణమునుండి స్టీమరుమీద కొలంబో బోయి అచ్చటనుండి హిందూమహాసముద్రముమీద ఆగ్నేయమూలగ ప్రయాణముచేసి ఆస్ట్రేలియాఖండపు పడమటితీరమున గల ఫ్రీమాంటిల్ రేవు చేరుదుము. ఇచ్చటనుండి దక్షిణము ప్రయాణముచేసిన అడిలైడ్, మెల్బోర్న్ చేరుదుము.

### ఇంగ్లాండు - ఆస్ట్రేలియా వ్యాపారమార్గము

లండను, లివరుపూలు, రేవులనుండి బయలుదేరి అట్లాంటిక్ సముద్రముమీదుగ జిబ్రాల్టరు జలసంధి దాటి మధ్యధరా సముద్రములోని పోర్టుసెడ్ రేవు చేరును. అచ్చటినుండి సూయజ్ కాలువ ఎఱ్ఱసముద్రముమీదుగ ఏడెన్ రేవు చేరును. ఇచ్చటినుండి అరేబియాసముద్రముమీద ప్రయాణము చేసి కొలంబో చేరును. కొలంబోనుండి ఆస్ట్రేలియాఖండపు పడమటి తీరమున నున్న ఫ్రీమాంటిల్ రేవు చేరును.

### న్యూజిలాండు ముఖ్యపట్టణములు

క్రైస్టుచర్చి:—మాంసము చెడిపోకుండ తయారుచేయు యంత్రశాలలు గలవు.

విల్లింగుటన్:—న్యూజిలాండునకు రాజధాని నగరము. ఇచ్చటినుండి గడ్డ పాలు, వెన్న, ఎగుమతి అగును.

### ఇతర విషయములు

గెయిజర్:—న్యూజిలాండునందు అగ్నిపర్వతములు పలువిధములైన పదార్థములను పైకి జిమ్ముచుండును. వీనిని గెయిజరులందురు.

రొటోరుఆ:—అగ్నిపర్వత ప్రదేశములందు ఒకచోట వేడి బురద, మరొకచోట పలువిధములైన వాయువులు, పైకి వచ్చుచుండును. ఈ ప్రదేశమునకు 'రొటోరుఆ' అందురు.

పాలినీషియా:—పసిఫిక్ మహాసముద్రములో ఆసియానుండి అమెరికావరకు గల దీవులకు పాలినీషియా దీవులని పేరు.

(సశేషము)

---

## వర్షబిందువు.

రచయిత గండికోట కామేశ్వరావు

“మేఘనాథు వీడి మేదినికేగంగ పయనమైతి నేమి ప్రాప్తమగునో ?
ఇల్లువిడువ మనసు తల్లడపడుచుండె, బ్రహ్మవ్రాత మార్చవశమె జగతి ?

* * * *

“ధూళియందుగలిసి దుమ్ముగా నౌదునో! అగ్నియందు భస్మ మౌదునేమొ ?

పడుదునేమొ వెళ్ళి పద్మంపు టాడిలోన దేవుడెఱుగు జరుగబోవు విధము'' 2

*   *   *   *

అట్లు చింతించుబిందువు నాక్షణంబ వాయుదేవుడు గొంపోయె వనధికడకు;
చేరఁదీసెను ముత్తెపుచిప్ప యొకటి, పుడమిల్లోపల బిందువు ముత్యమయ్యె.

*   *   *   *

ఇల్లుకదల గుండె ఝల్లు మనెడివారు కదలలేరు, కీర్తిగాంచలేరు,
సాహసించునట్టి జనము లెచ్చటనైన బిందువట్లు ఖ్యాతి బొందుచుంద్రు.

*   *   *   *

---

## ధ న ప్ర భా వ ము

అరసాడ భానుమూర్తి పట్నాయక్ (రాంపురం)

అనగా అనగా ఒక పల్లె. ఆపల్లెలో ఇద్దరు అన్నదమ్ములు కలిసిమెలసీ ఉన్నారు. వాళ్లకి చాలాడబ్బు, భూములు ఉన్నై. ఆ ఆస్తిని ఒకర్నిగాదని ఒకరు కాజెయ్యాలని దుర్బుద్ధి పుట్టింది. అన్నకీ తమ్ముడికీ. అందుకోసం ఒకర్ని ఒకరు చంపెయ్యాలని మనసులో అనుకున్నారు. తగిన సమయం కోసం చూస్తున్నారు.

ఇలాగుండే సరికి ఒకనాడు అన్నపొలానికెళ్తూ ఇంటికి రావడం ఆలస్యం అవుతుంది గనుక అన్నం పొలానికే పట్టుకొనిరా, అని తమ్ముడితో చెప్పి పొలంపనికి వెళ్లిపోయాడు. సరే, మంచిసమయం కుదిరిందని ఆయన్నంలో మొదటిరకం నాభి, నల్లమందు, కలిపి తమ్ముడు తీసికెళ్లాడు. ఇదే సమయం అని అటూ ఇటూ చూచి ఒక్క పిట్టైనా లేకపోవుటచూచి తన చేతనున్న బడితతో బుఱ్ఱబద్దలు గొట్టాడు అన్న.

తమ్ముడు చచ్చాడు, ఆస్తి, అంతానాదే అని పొంగిపోతూ మూటవిప్పి అన్నం తిన్నాడు. కూనిరాగాలుతీస్తూ కాస్సేపటికి విషం తలకెక్కి విలవిలగింజుకుని ప్రాణాలు విడిచినాడు అన్న.

ఆత్రోవను ఒక బైరాగిపోతూ జరిగినదానిని తన మహిమవలన తెలిసికొని "అమ్మా! లక్ష్మీదేవీ! నీప్రభావం అమోఘం. నీకటాక్షం మాత్రం నాపైకి ఎప్పుడూ రానీయకు" అని తలచుకొని తనదారిని చక్కా పోయాడు. కథ కంచికీ మనం మంచం మీదికీ.

N. B:—ఇట్టికథలు సాధారణంగా ముసలమ్మలు చెబుతుంటారు. ఇటువంటి కథలద్వారా బాలురకానందమును చేకూర్చవచ్చును. నీతిని బోధించవచ్చును. కాన ఇట్టిముసలమ్మ కథలను సేకరించి ఈపత్రికా ముఖమున వెల్లడిచేయవలసినదిగా ఉపాధ్యాయసోదరులను వేడుచున్నాను.

ఇట్లు
అ. భా.

---

# విజయమునకు విద్యార్థుల కర్తవ్యము

MR. N. శ్రీకంఠయ్య, F. T. S.,
(ప్రాథమికోపాధ్యాయుడు కర్నూల్ జిల్లాబోర్డు)

ప్రియవిద్యార్థులారా!

యజమానునికిగాని, నాయకునికిగాని, ప్రభువునకుగాని, ఆపద సంభవించినపుడు త్రికరణశుద్ధిగా సహాయము చేయుట మానవధర్మము. అట్లు సాయపడక పైవారల దోషములనే లెక్కించుచూ, వారికి సాయముచేయకపోవుట పౌర ధర్మమునకు విరుద్ధము. అట్టివాడు నిజముగా రెండు లోకములందును చెడినవాడే. ఒకానొకప్పుడు మనయింటి యజమాని, మనకునూ కొన్ని అధికారముల నీయలేదని (బహుశా మన అసమగ్రతను గ్రహించి) ఆతనిపై ద్వేషమూని కర్మవశమున ఆతనికి ఆపద వచ్చినప్పుడుగాని, లేక ఇతరులతో తగవు వచ్చినప్పుడుగాని, మనము యజమానికి సాయపడక, మనకు పూర్వము అధికారము యీయలేదను ఈర్ష్యాసూయలచే మనమూ ఆపదయందు సాయపడక ఊరకున్ననూ, లేక విరోధిపక్షము వహించి పనిచేసినను, లోకులు మనలచూచి నవ్వరా? లోకము నవ్వుటయేగాక మన కుటుంబమునకు కీడువాటిల్లదా? మనమప్పుడు సాయపడకపోయినను దైవబలమువల్ల ఆపదనుంచి మన యజమాని గడచి గట్టెక్కినపిమ్మట మనమెడ పూర్వ ప్రేమను గనబఱచునా? ఈ విరుద్ధ ప్రచారమువల్లను (సాయపడనిచో ఇంచుమించు విరుద్ధ ప్రచారము క్రిందనే తలచబడును) మనకు అధికారములు రాకపోవుటయేగాక పరస్పర ప్రేమశూన్యులమగుదుము గదా? యథార్థముగా మనమును కొన్ని యధికారములు సంపాదించవలయునన్న ఆపదలయందు ధైర్యోత్సాహములతో, పరిపూర్ణ విశ్వాసముతో, యజమానునికి సాయపడవలయును. అట్లు లేక ఆపదలో సాయపడకయే ముందధికారమిచ్చిన సాయపడుదుము లేనిచో లేదని బెదిరించినచో కార్యావసరమునుకల్గి మన ఏర్పాటునకు తాత్కాలికముగా ఒప్పుకొన్నను, ఆపదగడిచిన తర్వాత మన మాతని ఇబ్బందిని సైతము గ్రహించక ఆపదయందే, సాయపడుటకు ముందె, నిష్పక్షపాతముగా అధికారములు కోరితిమను ఈర్ష్యచే తిరుగా యిచ్చిన అధికారములాగుకొన్న ఏమిచేయగలము? అందుకు కారణములు చూపవలయునన్న మనయందెన్నో యదార్థముగా కానుపించుచునే యుండును. సంసారమునందలి యజమాని తాత్కాలిక ఆపదలనుండి రక్షించబడి, ఆ సంసారమును విజయవంతముగా నడుపవలయునన్న ఆ సంసారమందలి సర్వులు స్త్రీపురుష వయోవిచక్షతలేక సాయపడవలయును. అట్లు గానిచో ఆ సంసారము భిన్నాభిన్నముగ నుండును గదా! ఇందాశ్చర్యమేమి?

## ఇక ప్రస్తుత అంశమునకు వత్తము.

ఆశాపాశబద్ధులగు ఇతర దేశాధిపతులు తమతమ అధికారములను, రాజ్యములను, విస్తరింపజేసికొనవలయుననెడి తలంపుతో అక్రమముగా మన సార్వభౌమునిపై దండెత్తిరి. యదార్థముగా మన సార్వభౌమునికి యుద్ధముజేయు నభిలాష లేకపోయినను విధిలేక యుద్ధమునకు పూనుకొనవలసి వచ్చినది.

యుద్ధముద్వారా దేశమునకు, తద్వారా ప్రజలకును, ఎట్టి బాధలు గల్గుచున్నదియు మీరెరుగనిదియు గాదు. తినుటకు అన్నమును, కట్టుకొనుటకు గుడ్డలును, లేక మనలో చాలామంది అనగా ఇంచుమించు అందరూ బాధపడుచునే యున్నారు. మీకు రాత్రిపూట చదువుకొనుటకు మంటినూనె (కిరోసిన్) లభించక రాత్రిళ్ళు చదువే మానివేసితిరి. వ్రాసుకొన కాగితములులేక మీ యభివృద్ధికి ఆటంకములు కలుగుచునే యున్నవి. ముఖ్యముగా మీలో చాలామంది పిల్లల తలిదండ్రులు వారు అన్నముతినక ఎట్లో కష్టపడి పిల్లలకు తినుపించుచున్నారు. ఆహార వస్త్రములకొరకు లెక్కలేనన్ని దోపిళ్ళు జరుగుచున్నవి. కురణములు పంభవించుచున్నవి — వ్యాధుల పాలగుచున్నారు — క్రూరకార్యములకు పూనుకొనుచున్నారు. ఈ ఘోరములు, ఈ అల్లరులు, జరుగ కారణమేమియో యోచించితిరా? ఇదంతయు యుద్ధపు మహిమయే. "ఆవు నావు కుమ్ములాడ లేగ కాళ్ళు విరిగె" నన్నట్లు రాజులు రాజులు పోట్లాడ ప్రజలకు ఈ ఇబ్బందులు సంభవించును.

---

* శ్రీ వేంకటరమణా థియోసాఫికల్ హిందీ & తెలుగు ప్రాథమిక విద్యాలయమందు వినాయక చవితినాడు విద్యార్థులకొఱకు జరుపబడిన విఘ్నేశ్వరపూజానంతరము ఒసగబడిన యుపన్యాసము.

యుద్ధము అంతమయి ప్రపంచమున తిరుగా శాంతి నెలకొల్పబడువరకు ఈ యిబ్బందులు సర్వుల బాధించును. ఈ యిబ్బంది త్వరగా పోవలయునని యే సర్వులు యుద్ధము త్వరగ ముగియ వలయునని తలంచుచున్నారు. కాని అందుకు తగు తీవ్రమగు కృషిని సర్వులు చేయకయున్నారు. మాట్లాడనేర్చిన ప్రతివ్యక్తియు, ధర్మవిజయము కొరకు, లోకశాంతికొరకు, సాయపడవలసినదే! నా యీ మాటవలన మీకు ఆశ్చర్యము కలుగ వచ్చును. ఏలన "మేము గూడా యుద్ధమునకు సాయపడవలసినదేనా? అయ్యో! సైనికవీరులమగుటకు మాకు తగినంత బలములేదే, ద్రవ్యసాయము చేయ మేమేమియు సంపాదింప ఇంకను పూనుకొనలేదే? మా ఆహారమునకే ఇతరులపై ఆధారపడియున్నామే? ఇట్టియెడ మేమెట్లు ద్రవ్య, ధాన్య సహాయము చేయగలము?" అను సందియము మీకు కలుగవచ్చును. అదియు సహజమే. కాని మీరు చేయదలచిన, చేయగల, సాయము లేకపోలేదు. మీరేగాదు సర్వులు, అనగా బీదలు, రోగులు, బలహీనులు, బాల-బాలికలు. వృద్ధులు, స్త్రీలు విద్యరానివారు, వారు వీరననేల సర్వులు ఆ సాయము చేయగలరు. అయితే మీకందరకు తెలియని ఏదో క్రొత్త విషయము నేను మీకు చెప్పబోవుచున్నానని ఎంచకుడు. పురాతనమార్గమే. కేవలము మీకు జ్ఞప్తిజేయు నుద్దేశ్యముతో వ్రాయుచున్నాను. ఈ కార్యము మీరూహించు నంతటి కష్టమయినది గాదు. అదేదన ధర్మవిజయముకొఱకును, ప్రపంచ శాంతికొఱకును, విశ్వసోదరత్వముకొఱకును, ప్రార్థనలు సల్పుట" దినమునకు రెండు పర్యాయములు. నిద్రలేవగనే—తిరుగా నిద్రించునపుడు—ఈప్రార్థన చేయుట మీకు అల్పముగను, తేలికగను, సులభముగను, కాన్పించవచ్చును. దీని ఫలితములు అమోఘము, అమూల్యము. రామకార్యమునకు వానర సైన్యము తోడగునట్లు, మీ సంకల్పబలములన్నియు ఏకమయి మన సార్వభౌమునికి విజయము చేకూర్చును. తుపాకులు, మరఫిరంగులు, చేయజాలని దుర్ఘటకార్యములు సైతము ప్రార్థనల మూలమున నెరవేరగలవని మహాత్ముడే వచింపలేదా? కాన మాదిరి ప్రార్థనములను వ్రాయుచున్నాను. ఇందులో మీ మీ యోగ్యతానుసారముగా, ఎన్నుకొని కంఠస్థముచేసి ఆచరించుడు. లేక యింతకన్న ఉత్తమ భావ యుక్తములగు ప్రార్థనావాక్యములను ఎన్నుకొని ప్రార్థించిననూ సరియే- ఈపనులు (ప్రార్థనలు) మాట్లాడనేర్చిన ప్రతివారు చేయగలరుగదా?

## మాదిరి ప్రార్థనలు.

### ప్రాథమిక విద్యార్థులకు
### 5 సం॥ మొదలు 10 సం॥ వరకు

(విద్యావిహీనులకు)

మనరాజునకు జయము గల్గుగాక!

ప్రపంచము శాంతినొందుగాక!

### మాధ్యమిక విద్యార్థులు
### 10 సం॥ మొదలు 16 సం॥వరకు

(స్వల్పవిద్యావంతులు)

సర్వశక్తివంతుడవగు నో ప్రభువా! మా సార్వభౌమునకు యుద్ధమునందు విజయము చేకూరుగాక! ప్రపంచమందంతటను శాంతి నెలకొల్పబడుగాక! విశ్వమానవ సౌభ్రాతృత్వము మాలో నుదయించును గాక!

### ఉన్నత విద్యార్థులకు 16 సం॥లకుపైన

(విద్యాధికులకు)

విశ్వనియంతవగు ఓ సృష్టికర్తా!

ధర్మరక్షణకొరకు ప్రస్తుతయుద్ధమందు పోరాడుచున్న మా సార్వభౌమునకు పరిపూర్ణ విజయమును గలింపుము రాజ, దేశభక్తితో తోడిమానవుల రక్షణకొఱకు, తమ తమ వేడిరక్తము ధారవోయ రణరంగముజేరిన సైనికవీరులకు సమధికోత్సాహమును, సమయస్ఫూర్తిని, గలుగజేయుము. వీరస్వర్గమును చూరగొన్న యోధాగ్రేసరులకు సద్గతుల గలుగజేసి వారివారి కుటుంబములకు విషాద రహితమును, సంతోషభరితమును అగు శాంతి నొసంగుము. ధనధాన్యముల విజయముకొఱకు విరాళములొసంగిన యుదారులకు, సద్బుద్ధిని, ఆయురారోగ్య ఐశ్వర్యాదుల నొసంగుము. ఓ ప్రేమమయా! మా సార్వభౌమునియందు మాకు పరిపూర్ణ భక్తివిశ్వాసములు, మా సార్వభౌమునకు మాయందు అపారకరుణయు, నుండునట్లు అనుగ్రహింపుము. సర్వప్రపంచమున శాంతి నెలకొల్పబడి,లోకము జాతి, మత, విచక్షణ లేక పరస్పరప్రేమతో తులదూగుగాక! మా సార్వభౌముడు సంపూర్ణవిజయ వంతుడగుగాక! భారత మాత దాస్యవిముక్తి జెందుగాక!

బాలులారా!

ఇట్టిప్రార్థనలచే అనుదినము నియమము తప్పక మీమీ యిష్టదైవమునుగూర్చి ధ్యానించుచో ఆచిర

కాలములోనే మన సార్వభౌముడు విజయుడుగా గలడనిన ఆందాశ్చర్యమేమి ?

ఒకవేళ మీలోని కొందరు మహమ్మదీయ సోదరులు "ఇదిమా ప్రభుత్వముగాదు. క్రైస్తవప్రభుత్వము మా ప్రభుత్వమగుచో, మాశౌర్యములను జూపియు, సమాజులుచేసియు, సాయపడకపోదుమా యనియు, హిందూసోదరులు మా హి ం దూ సామ్రాజ్యమే యగుచో మేమూబాలగోపాలము శారీరకమానసిక నైతిక ఆరిక, సాయము సర్వతోముఖముగ జేయక పోదుమా? ఇది క్రైస్తవ సామ్రాజ్యముగాన సర్వ ప్రయత్నములు క్రైస్తవులె జేసికొనవలసినదే" యను భావములు మీలోనుండిన యదార్థముగా మిమ్ములను పిచ్చివాండ్రనియే భా వి ం ప వలయును - ఎట్లన ? హిందువుల గృహములంటు కొన్ని హిందువులె ఆర్పవలయుననియు, మహమ్మదీయ బాలురు భావిలో పడిన, మహమ్మదీయుడే బయటికి తీసి రక్షింపవలయుననియు, ఆచారము ఎక్కడనైనాయున్నదా ! నిజముగా యిట్టి ఆచారము ఏదేశమునగాని, ఏ గ్రామమునగాని, ఏ పవిత్రహృదయమునందు గాని, యుండదు. అట్లున్న ఇంతకన్న ఘోరము మరొకటిగలదా! అసలు మతమననేమో సూక్ష్మముగానైనా ఎరుగుదురా? భగవంతునిజేరు వివిధమార్గములలో ఆది యొకమార్గము, మతముల పేర్లు వేరైనను మూలతత్వములు ఒకటేయను సూత్రమును మరువవలదు ఎప్పటికి ఈ భేదమేగూడదు - అట్టియెడ ఆపదలందు ఈ భేదము పాటించిన మహాపాపముగూడను కాన మతభేదముమాని విజయప్రార్థనలకు ఆరంభించండి.

జపాను ప్రభుత్వము మనదేశమునకు వచ్చిన బాగుండునని కొందరు బలుకుమాటలను సరకుజేయవలదు. "భారతీయులపై మాకు ప్రీతిమెండు వారిని మేము హృదయి పూర్వకముగా ప్రేమించుచున్నాము వారికి స్వాతంత్ర్యము నొసగుటకే మేమీయుద్ధము జేయుచున్నాము." అని జపానువారు ప్రకటించిన ప్రకటనను నమ్మవలదు వ్వారుమాటలచే మనలగార నింపజూతురు గాని హృదయములచేగాదు - ఆ మాటల గౌరవముగూడా తా త్కా లి క ము గ నే యదార్థముగా పిల్లిపెలుక్కకు ఎట్టిప్రీతియో అట్టి ప్రీతి అంతరంగరమున మనయెడ జపానువారికిగలదు పులి ఆవును ఎట్లు హృదయపూర్వకముగా ప్రేమించునో అంతటి హృదపూర్వకప్రేమ మనయెడగలదు. ఇక పిల్లి ఎలుకలజంపునది మారికొవ్యాధి నరికట్టుటకే యనిన ఆమాటపై ఎంతనమ్మకముండునో జపానువారు మనకుస్వాతంత్ర్య మొసగుటకు యుద్ధము ఆరంభినారనిన అంతనమ్మకముండును - జర్మనువారుగూడా ఇంతె అను మాటలు మరువవలదు. చరిత్రకారులు వ్రాసినవ్రాతలనుబట్టి నే చెప్పుచున్నానే గాని ఏదోపనికిమాలిన మాటలుగావు - ఇవి యదార్థములు-ఇట్టి పరిస్థితియందు వారిసామ్రాజ్యమును మన దేశమునకు ఆహ్వానించిన ఎట్లుండునోయూహింపుడు. నాయూహకెట్లు తోచుచున్నదన భూతమును విందునకు పిలిచినట్లగును-ఎట్లన భూతమును వడువబిలిచిన ఎందరికో చేయబడిన పదార్థమును ఇతరులకు మిగల్చక తినుటయేగాక కడపటకృతఘ్నతతో ఆహ్వానించినవారిని సైతము మ్రింగివేయును. ఇందాశ్చరములేదు.

మరొకవిషయము యుద్ధప్రతికూల ప్రచారములు ఈ సమయమున సాయపడరాదనియు, విరాళముల నొసగరాదనియు, స్వాతంత్ర్య మొసగిననే సాయపడవలయుననియు, ప్రచారములు సల్పుచుందురేమో అట్టివారిమాటలు నమ్మవలదు - ఎట్లన ఆపదలందేనా పరుషవాక్కులు? ఇప్పటిలో సంపూర్ణసహాయముజేసి భారతదేశ ధైర్యస్థైర్యములను ప్రకటించినచో మన సార్వభౌముడు మెచ్చి మనకీయదగిన వాక్కులనీయడా! మెప్పించినచో కాగల మేలగును. ప్రతికూలమగుచో తాత్కాలికముగా మేలుసంభవించిననేమి అచిరకాలములో కీడుగా తప్పక పరిణమింపగలదు. ఆపదలందు సాయపడిన అనుగ్రహమునకును,వ్యతిరేకముతోనున్న ఆగ్రహమునకును, గురియగుట సహజమేగదా ! సమయమున స్వల్పసహాయముచేసినను లాభించును, అవసరానంతరము అనంతకోటి సాయములుచేసినను నిష్ఫలములే - అదను గుర్తించి విత్తనముచేయు సేద్యగాండ్రవలె మనమును సర్వవిధముల శక్తివంచన లేకుండ విజయమునకు పాటుపడవలయును - అందు మీకర్తవ్యము ప్రార్థనలు - మీరేగాదు ధన ధాన్య రూపమున సాయపడినవారుగూడా సర్వులు ప్రార్థనలు గావించవలసినదే ! సార్వభౌముని విజయము కొఱకును, లోకశాంతికిని, విశ్వమానవ సోదరత్వమునకు, మీరు ప్రారింభుటయేకాక మీద్వారా సర్వులకు ఈవిషయము తెల్పుటకై మీకు వలయు జ్ఞాపకశక్తి, ఉత్సాహము, అవకాశము, ఉత్తేజముగల్లుగాత! మీ బోధనలు సర్వులు గ్రహించి ఆచరింతురుగాత ! మనరాజునకు జయము త్వరలో గలుగుగాత ! మీ ప్రయత్నములకు సకలలోక పూజితుడును, దేవతలచే పూజింపబడు విఘ్నేశ్వరుడు, తోడగు గాక ! నేను మిమ్ము కోరినట్లే మీరును ప్రతి బాలుని ఈక్రిందిరీతి సంబోధింపుడు.

## బాల ప్రబోధము (పాట)

[చెల్ - చల్‌రె - నౌజవాన్ పాటమాదిరి.]

1. మంచిబాలుడా! ఓ మంచిబాలుడా! మామంచిబాలుడా
చేయుమురా ప్రార్థనంబు జయముకొఱకునూ ॥మం॥
2. యుద్ధమందునా జయముపొందనూ, మంచిమనసుతో
ప్రార్థించబూనరా - పూనుమురా, నేటినుంచి మరచిపోకురా ॥మం॥
3. లేరు నీవలెన్ వేరెవరు పూనగన్ నియమంబుతోడుతన్
అనుదినము జేయగన్ సార్వభౌముజయముకొరకు ప్రార్థించరా ॥మం॥
4. శత్రురాజ్యమే మనదేశమొచ్చినా ధర్మాలు గూల్చదా
దగ్ధంబుజేయదా - శత్రునాశంబుకొఱకు జయముగోరదా ॥మం॥
5. రమ్ముబాలుడా! రారమ్ము బాలుడా! ప్రార్థింపుబాలుడా
చేయుమురా ప్రార్థనంబు లోకశాంతికీ ॥మం॥

---

**Proceedings of the Junior Red Cross Sub-Committee meeting held on 5—9—43 in the office of the Deputy Inspector of Schools, Ellore range.**

Members present :—1. Sri V. V. Subrahmanya Sastri (Secretary)
2. Sri V. L. Narayana B. A., L. T., Personal Asst. to the District Edl. officer, West Godavari.
3 Janab Muhd Lall Saheb; Junior Deputy Inspector of schools, Ellore range.

Resolved to address the Inspecting officers in the District for their views in the matter and holding competitive examinations between schools that have formed Junior Red Cross Groups.

(Sd.) V. L. NARAYANA,
for Secretary, Junior Red Cross Sub-Committee.

---

## సభలు - తీర్మానములు.

ది 4-9-43 వ తేదీని జరిగిన కాకినాడ ఎయిడెడ్ గ్రూప్ టీచర్ల అసోసియేషనులో గావించిన తీర్మానములు.

1. సెకండరీగ్రేడు ట్రైనింగు పొందు నర్హతగలవారు యుద్ధ ఉద్యోగములకు పోవుటచేత అట్టివారి సంఖ్య చాల తగ్గినందున S. S. L C. పరీక్ష తప్పినవారిని సెకండరీగ్రేడు ట్రైనింగులోనికి తీసికొనుచున్నారు. కాన హాయ్యర్‌గ్రేడు ట్రైనింగు పరీక్షయందు తీర్ణులైనవారిని నేరుగా సెకండరీగ్రేడు ట్రైనింగు పరీక్షకు కూర్చుండుటకును, అందు తీర్ణులగువారిని సెకండరీగ్రేడు ట్రైనింగు ఉపాధ్యాయులుగా పరిగణించవలసినదనియును—

2. నలుగురుగాని అంతకంటె నెక్కువమంది ఉపాధ్యాయులుగల పాఠశాలలకు సెకండరీగ్రేడు ట్రైనింగు ఉపాధ్యాయులు మాత్రమే హెడ్మాస్టర్లుగా నుండవలెనను నిబంధనలను సడలించి ప్రస్తుత పరిస్థితులను బట్టి అట్టి ఉపాధ్యాయులు దొరకుట కష్టము గాన హయ్యరుగ్రేడు ట్రైనింగుపొందినవారుగాని లేక ట్రైనింగయిన టీచరు మేనేజర్లు (ఏగ్రేడైనను) గాని సదరు పాఠశాలలకు హెడ్మాస్టర్లుగా నుండవచ్చుననియు అనుమతినీయవలసినదనియు శ్రీ విద్యాశాఖ డైరక్టరుగారిని కోరుచు తీర్మానించడమైనది.

4—9—43, కాకినాడ. —సదాశివుని చక్రపాణి, కార్యదర్శి.

1. అయనాలవారిపాలెం —

ది 27-9-43 తేది సాయంత్రం 6 గంటలకు మా జూనియరు డిప్యూటీ ఇన్‌స్పెక్టరు శ్రీ లొల్ల అనంతరామ దీక్షితులుగారి అధిపత్యమున మా పాఠశాలాభవనములో తల్లిదండ్రుల సంఘసభ జయప్రదముగా జరుపబడెను. శ్రీ ఇన్‌స్పెక్టరువారు చేరవలసిన పిల్లలగూర్చియు, విద్యయొక్క ఆవశ్యకతను గూర్చియు, ప్రస్తుత సంగ్రామ పరిస్థితులగూర్చియు, ఆహారపదార్థసమస్యనుగూర్చియు, చక్కగా నుపన్యసించిరి.

యు. గోపాలకృష్ణమూర్తి,
టీచరు మేనేజరు.

2. రాజోలుతాలూకా ఎయిడెడ్ ఎలిమెంటరీ టీచర్లయూనియనుయొక్క గ్రూపుమీటింగులు 11-9-43 తేదీన కొత్తపేటలోను 18-9-43 తేదిన ముంగండ సెంటరులోను, అతివైభవముగా జరుపబడి, స్కేలు హెచ్చించవలెననియు, యుద్ధఅలవెన్సు హెచ్చించవలెననియు, నెలవారీ గ్రాంటులిప్పించవలెననియు, తీర్మానించబడెను.

యం. వేంకటరమణ,
కార్యదర్శి.

3. తాడిమఱ్ఱిసెంటరు - అనంతపురంజిల్లా —

1943 సం॥ ది 18 సెప్టెంబరు తేదిన తాడిమఱ్ఱి కేంద్రోపాధ్యాయ సంఘ సమావేశము జరిగెను. ఆసమావేశమునకు అనంతపురమండల విద్యాశాఖాధికారులైన శ్రీ డి. నరసింహశాస్త్రిగారు M.A.L.T., అగ్రసనాధిపత్యము వహించిరి. శ్రీవారికి ఉపాధ్యాయసంఘము తరఫున స్వాగత నవరత్నమాలిక (పద్యములు) సమర్పింపబడెను. నాటి సమావేశమునకు మాధర్మవరము రేంజి స్కూల్సుడిప్యూటీ ఇన్‌స్పెక్టరుగారైన శ్రీ కె. సి. హెచ్. వెంకటరమణ బి. ఎ. బి, ఇ డి. గారు విజయముచేసియుండిరి నాటిసభలో తీర్మానింపబడిన యంశములు.

1. బియ్యము, కిరసనాయిల్, ఇతరవస్తువులు, దొరకుట చాలదుర్లభమైనది, కావున ధర్మవరము తాలూకా తహశీల్‌దారు వారినుండి తల 1 కి 1 మూటబియ్యము, 4 సీసాలనూనెను. ప్రతినెలయిప్పించు లాగునగోరు తీర్మానము డి. ఇ. ఒ. గారి ద్వారా పంపుకోవడమైనది.

2. యుద్ధపు అలవెన్సులను అందరివలె మాకును ఇప్పించులాగున కోరడమైనది. ఖర్చులెక్కువైనవి గనుక కంటింజెటులనుగూడ ఎక్కువయిప్పించవలెనని కోరడమైనది.

మంగళముతో సభముగింపబడెను

తాడిమఱ్ఱి, 13—9—43. వి. నరసయ్య, కార్యదర్శి.

4. కైకలూరు గరల్సుసెంటరు —

ఈ సెంటరుటీచర్లు 18—9—43 తేదిని శ్రీకూచిబొట్ల ఆంజనేయులుగారి అధ్యక్షతక్రింద కైకలూరు గరల్సుస్కూలులో సమావేశమై కృష్ణాజిల్లాబోర్డు ప్రాథమిక పాఠశాలోపాధ్యాయ సంఘమునకు రు 33-4-0 లు చందాలు యిచ్చుచు సంఘమును అనవసరవిమర్శలకు గురికాకుండ నడిపించుచుండ గలందులకు కోరుచు తీర్మానించిరి.

(True Copy)

కైకలూరు, గరల్సుసెంటరు, 19—9—43 బి. హెచ్. కామయ్య కార్యదర్శి.

# ప్రాథమికోపాధ్యాయ కేంద్రసభ
# ముదినేపల్లి, కృష్ణాజిల్లా

25—9—43 న మధ్యాహ్నము గం 3 లకు గుడివాడ రేంజి జూనియరు డిప్యూటీ ఇనస్పెక్టరు గా॥ గు శ్రీ బి. డి. యస్. విలియం B. A., L. T. గారి ఆధిపత్యమున సమావేశమాయెను.

విహిత కార్యక్రమమైన పిమ్మట శ్రీ గొట్టిపాటి కోటయ్యగారు గత నెలలో వివిధరంగాలలోని యుద్ధపరిస్థితులను సమీక్షించుచు, ఇటలీ ప్రభుత్వములో కలిగిన మార్పులు- అట్టిమార్పులు వచ్చుటకుగల కారణములను వివరించుచు ఈ విధముగానే ఆక్రమిత నాజీ ప్రదేశములు అగ్నిపర్వతమువలె ధుములుచున్న సమయము చిక్కగానే ప్రళయమువలె ఒక్కుమ్మడిగా ప్రజా తిరుగుబాటు కలుగు సూచనలున్నవని— రష్యారంగములో రష్యనులు ఇతోధిక వేగముతో పురోగమించుచున్నారని కొద్దికాలములో రష్యనులు నాజీల స్వాధీనములోయున్న రష్యానే కాక జర్మనుల మాతృదేశములో కూడ ప్రవేశించు సూచనలు కనబడుచున్నవని పసిఫిక్‌లోని జపాన్ పరిస్థితులు ప్రస్తుత హిందూదేశములో జాతియైక్యత లేకపోవుట ఆహార సమస్యకూడ యేవిధముగా జపాన్ ముష్కరుల సత్వరదాడికి అవకాశమిస్తున్నాయో వివరించిరి.

పిమ్మట అధ్యక్షులు ప్రస్తుత పరిస్థితులలో గూండాబ దుష్ప్రచారమును అణచుట ద్వారా మాతృదేశ రక్షణ బాధ్యతను వహించుటకు, ప్రతి ఉపాధ్యాయుడు జాతీయ సమరాంగణశపథము (National War Front Pledge) ను పూని, తద్విధులను పాలించవలసిన ఆవశ్యకతను వివరించుచు— ఈ సమయములో ఉపాధ్యాయులు తమ్ముగలవారు కూడ War Defence Savings Bonds ను కొని మిత్రరాజ్య సత్వర విజయమునకు, అక్షరాజ్య ఓటమికి సాయపడవలసినదిగా హెచ్చరించిరి.

అభివందనములతో సభ సమాప్తము గావింపబడినది.

—జి. కె. చౌదరి.

## విజయనగరం రేంజి, విశాఖపట్టణంజిల్లాబోర్డు ప్రాథమికోపాధ్యాయుల యూనియను సభ

విజయనగరములో తే 11-9-43 దీన సాధారణ సభ జరుపబడెను. అందు ప్రతి సెంటరుకు యేర్పరచబడిన టీచర్లువెల్లి సంఘము అభివృద్ధి గావించుటకు టీచర్లకు ప్రబోధముచేసి జిల్లాసంఘము యేర్పరచుటకు అందరి ప్రోత్సాహము కోరుటకు నియమించడమైనది.

(2) ప్రతిరేంజి సంఘమునుంచియు ఇద్దరు ప్రతినిధులు జిల్లాసంఘమునకు పంపుటకు ప్రతిరేంజి తరఫున రు 1/- ఒకరూపాయ చందాపంపించ. నిర్ణయించడమైనది.

(3) ఈ కాటకపురోజులలో శ్రీ జిల్లాప్రెసిడెంటువారు ప్రతిటీచరునకు తగినంత కఱవుభత్యం యిప్పించగలందులకు తిరిగి కోరడమైనది.

(4) ఈ కాటకపుదినములలో బడి కంటిజెన్సీ చాలనందున హాయ్యర్ ఎలిమెంటరీ స్కూలుకు రు 1/8/- ఎలిమెంటరీ స్కూలుకు రు 0-8-0 (అర్ధరూపాయి) హెచ్చుగా నిప్పించ కోరడమైనది.

(5) ప్రత్యేకబాధ్యత గలిగి, ఖర్చులకు లోనగు స్కూలు హెడ్మాష్టరుకు ప్రత్యేకంగా హాయ్యర్ ఎలిమెంటరీస్కూలు హెడ్మాస్టరు రు 3/ ఎలిమెంటరీస్కూలు టీచరుకు రు 1/- చొ॥ అదనముగా ఎలవెన్సు యిప్పించ కోరడమైనది.

(6) జిల్లాసంఘము ఈసంవత్సరాంతం లోగా యేర్పాటు గావింపవలయుననియు నిశ్చయించడమైనది.

విజయనగరం
11—9—43

ప్రెసిడెంటు
చాగంటి రామలింగస్వామి
శెక్రటరి

గంట్యాడ సెంటరు తా॥ సభ 11-9-43 న జయప్రదంగా జరుపబడినది. అందు పూర్వము తెప్పించుచున్న "ప్రారంభవిద్య" ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్యల తెప్పించుటయేకాక "ఆంధ్రవారపత్రిక" "భారతి" లను తెప్పించుటకు నిశ్చయించడమైనది. ఈ బియ్యపు ..........కఱవుచే ప్రతి టీచరుకు తన కుటుంబమునకు కావలసిన కనీస బియ్యం అందునట్లు ప్రత్యేకంగా సరఫరా చేయించవలసినదిగా శ్రీ సబుకలెక్టరు వారిని కోరుటకు ప్రత్యేకముగా సెంటరు సెక్రెటరీగారికి నియమించడమైనది.

Gantyada,
D/ 15—9—43

Ch. Ramalingaswamy,
Sec. C.C.

విశాఖపట్నం ప్రభుత్వ బోధనాభ్యసన పాఠశాల విద్యార్థి సమితి నేడు విద్యార్థి వసతిగృహమందు సమావేశమై ఈ క్రింది తీర్మానములను ఆమోదించెను. శ్రీ. A. S. చలపతిరావు పట్నాయక్ గారు B. A. అగ్రాసనాధిపత్యమును వహించిరి.

i ట్రయినింగు విద్యార్థులకు ప్రస్తుత మిచ్చుచున్న స్టైపెండు చాలకయున్నది. గాన కరవు భత్యము రు 2/- ఇవ్వవలసినదిగా శ్రీ శ్రీ శ్రీ గవర్నమెంటువారిని కోరుచూ సభలు జరిపి తీర్మానములు చేయుచూ వాటిని యీ పత్రికా ముఖమున ప్రకటించి కరవుభత్యముల విషయమై తగిన ఏర్పాటు చేయవలసినదని తదితర ట్రయినింగు పాఠశాలా విద్యార్థులను ఈ సభవారు కోరుచున్నారు.

ii ప్రారంభవిద్యనుకూడా (ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య గత 2 నెలలనుంచి తెప్పించబడుచున్నది) తెప్పించవలయునను తీర్మానము శ్రీ తిరుమలరాజు సూర్యనారాయణరాజుగారు ప్రతిపాదనచేయగా ఒకరిద్దరు మాత్రము ఆక్షేపణను తెలిపిరి.

iii బంగాళమునందుకరవువలనప్రతిదినమునుచాలమంది మృతినొందుచుండుటచే యీ సభవారు సంతాపమును ప్రకటించుచూ రు 5/-లు తత్ క్షామ నివారణార్థము పంప నిశ్చయించిరి. బెంగాల్ క్షామనివారణార్థము తమ శక్త్యానుసారము చందాల నివ్వవలసినదిగా ప్రాథమికోపాధ్యాయులను ఈ సభవారు కోరుచున్నారు.

iv సర్ విజయాగారు మేము (Training Students) రాయలసీమ క్షామ నివారణకు పంపిన రు 5/- లు కృతజ్ఞతతో స్వీకరించితిమనియు తక్కువ మొత్తమును పంపించినందుకు చింతించ నక్కరలేదనియు, అనేక కృతజ్ఞతా వందనములనియు వ్రాసినలేఖ చదివి వినిపించడమైనది.

శ్రీ A. భానుమూర్తిగారు వ్రాసిన "నిరక్షరాస్యతను నిర్మూలించుటెట్లు" (Vide Andhrarastra Prarambhavidya, Oct 42) అను వ్యాసమును శ్రీ A. S. చలపతిరావు పట్నాయక్ గారు B. A. (క్లర్కు- శ్రీ కలెక్టరువారి ఆఫీసు Vizag)

వ్రాసిన "స్త్రీ కెట్టివిద్య కావలెను" అను వ్యాసమును (సెప్టెంబరు 42 సంచికయు గలదు) చదువబడెను

అధ్యక్షులవారు క్షామనివారణకు విద్యార్థుల కృషిని పొగడుచు వయోజన విద్యా ప్రచారమెట్లు సలుపవలెనో నుడువుచు అంత్యోపన్యాసము ముగించిరి.

శ్రీ తిరుమలరాజు సూర్యనారాయణరాజుగారు ప్రస్తుత ప్రచండ భయంకర యుద్ధము అంతమగుటకును మనకే విజయం కలుగుగాక యని భగవంతుని ప్రార్థించిరి. తరువాత జయ శబ్దములతో సభముగిసెను.

అరసాడ భానుమూర్తి పట్నాయక్.

## కొవ్వూరు తాలూకా ఎయిడెడ్ ఎలిమెంటరీస్కూళ్ల టీచర్సు యూనియను వర్కింగు కమిటి మీటింగు

ది 18—9—43 తేదీని మధ్యాహ్నం గం 2 లు నిడదవోలు H. E. School భవనములో యీ దిగువ తీర్మానములు ఏకగ్రీవముగా ఆమోదింపబడెను.

1. కార్యనిర్వాహకవర్గ సభ ది 25-9-43 మధ్యాహ్నం గం 1 కు తిరిగి సమావేశము జరుపుటకు ఏకగ్రీవముగా ఆమోదింపబడెను.

2. తగ్గిపోయిన శ్రీ ప్రక్క విశ్వేశ్వరుడుగారిస్థానే శ్రీ దినవహి చినమాణిక్యాల రావుగారిని యీకమిటీకి కోఆప్ రేటెడ్ చేసుకొనుటకు ఏకగ్రీవముగా ఆమోదింపబడెను.

3 యీ సంఘమునుండి జిల్లా సంఘమునకు ప్రతినిధులుగా శ్రీ సి. హెచ్. జ్ఞానానందంగార్ని 2. శ్రీ దినవహి చిన మాణిక్యాలరావుగార్ని పంపించుటకు తీర్మానించడమైనది.

నిడదవోలు. 28—9—43. } జోశ్యుల సూర్యనారాయణమూర్తి శ్రక్రటరీ.

## కొవ్వూరు తాలూకా ఎయిడెడ్ స్కూళ్ల టీచర్సు యూనియను వర్కింగు కమిటి మీటింగు

ది 25—9—43 సం॥రం తేదీని మధ్యాహ్నం గం 1 కు నిడదవోలు H. E. School భవనములో యీ దిగువ తీర్మానములు ఏకగ్రీవముగా ఆమోదింపబడెను.

1. యీ యూనియను వార్షికసభ తాలూకా అసోసియేషను వార్షిక సభతోపాటు కలిపి జరుపుటకున్ను సదరు సభకు శ్రీ పశ్చిమగోదావరి జిల్లా విద్యాశాఖాధికారిగారిని అధ్యక్షులుగాను శ్రీ ఈదర వెంకట్రావు పంతులుగారిని ప్రారంభకులుగాను ఉండునట్లు యీ సభవారు ఏకగ్రీవముగా కోరడమైనది.

2. మేనేజర్లు మినహాయించు 15% ను పూర్తిగా టీచరుకు యిచ్చునట్లును మానేజర్లకు నిర్వాహణపు ఖర్చులక్రింద 15% అదనముగా యిప్పించవలెననియు,

డియర్ నెస్సు అలవెన్సు రు 2 లు నుండి రు 5 లుకు హెచ్చింపవలెననియు, 4, 5 తరగతుల ప్రవేశ నును $\frac{1}{4}$ వంతునుండి $\frac{1}{8}$ కు తగ్గింపవలెననియు, ఇద్దరుపాధ్యాయులు గల పాఠశాలలకు 30 ఆవ రేజికి పూర్తిగ్రాంటు యిచ్చుచున్నట్లే ముగ్గురుపాధ్యాయులు గల పాఠశాలలకు 50 ఆవ రేజికి పూర్తిగ్రాంటు యిచ్చునట్లు ఏర్పాట్లుచేయించవలయుననియు ఎలిమెంటరీ స్కూలు టీచరు 1 కి నెల 1 కి 4 సేర్లు కిరసనాయిల్ యిప్పించమని శ్రీ కలెక్టరు ద్వారవారిని కోరుచూ తీర్మానించడమైనది.

నిడదవోలు,
28—9—43.

జోశ్యుల సూర్యనారాయణమూర్తి
శక్రటరీ

## పోడూరుబోర్డు హయ్యర్ఎలిమెంటరీస్కూలు విద్యార్థి సంఘపు వార్షికోత్సవం.

ది 31-3-43 తేదీ సాయంకాలం ఈసంఘపు చతుర్థ వార్షికోత్సవము శ్రీడాక్టరు కోసూరు సత్యసీతారామరాజుగారి యధ్యక్షతను జరిగెను. బాలబాలికలచే సంగీతము ఏకలు చేయుట నూలుతీయుట కోలాటము మున్నగు ప్రదర్శనములు చేయబడెను. గ్రామకరణము పోడూరు నాగరాజారావుగారు శ్రీ పోడూరి వేంకటరాజుగారును, బాలురకు హితబోధచేసిరి. ఈసంఘపు గ్రంథాలయమునుగూర్చి శ్రీ పిన్నమరాజు వెంకట సుబ్బరాజుగారు ప్రశంసించిరి. మాజూనియర్ రెడ్క్రాస్ సంఘ కౌన్సిలరు శ్రీమాన్ చిలకమర్తి కేశవాచార్యులుగారు సంఘాభివృద్ధినిగూర్చి కొన్ని సలహాలనిచ్చి పాఠశాల కవసరములగు కొన్ని సౌకర్యములు చేయించవలసినదని మాసంఘము తరపున గ్రామస్తులను కోరిరి.

పాఠశాలలో ఫర్నిచరు తక్కువగనున్నందున పేరెంట్సు అసోసియేషనువారి సహాయము కోరుటకును, వంతెననుండి పాఠశాలకు (100 గజములు) కంకరరోడ్డు వేయించవలసినదని పంచాయితీ వారిని కోరుటకును, రాయలసీమ క్షామనివారణనిధికి రు 4/- లు విరాళము ఈ సంఘమునుండి పంపుటకును తీర్మానములు జరిగెను.

పాఠశాలకు ఫర్నిచరు నిమిత్తము గ్రామపెద్దలు శ్రీ రుద్రరాజు నారాయణ రాజుగారు (ప్రొప్రైటరు నేరేడుమిల్లి & రావిపాడు) రు 25/-లు విరాళమొసంగిరి. ఇతరగ్రామస్థులు తగు సహాయ మొనర్తుమని సెలవిచ్చిరి.

అధ్యక్షులు సంఘముయొక్క అభివృద్ధిని ఉపాధ్యాయుల కృషిని ప్రశంసించుచు మాసంఘమునకు రు 5/- లు విరాళమొసంగిరి.

అధ్యక్షులకును. గ్రామస్థులకు ఉపాధ్యాయులకు వందనములతో సభ ముగిసెను. అల్పాహారవిందు జరిగెను.

ఇట్లు
తమ విధేయుడు
రుద్రరాజు రామరాజు

పోడూరు
7—9—43




1941 వ సంవత్సరపు నూతన సిలబసు ననుసరించి

# ప్రాథమిక భూగోళములు

శ్రీ K. వెంకట్రావు B.A, L.T., గారిచే

2 - 3 - 4 - 5 తరగతులకు

వలయువారు:—రామా అండ్ కో.,

ఏలూరు - గుంటూరు - రాజమండ్రి.